## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరామ!

# పీ ఠి క

పురాణములు, వేదప్రతిపాదితములైన విషయములను విపులముగా, మనోహరముగా, దృష్టాంతపూర్వముగా, నుప దేశించుచు, వేదములకొకరీతి వ్యాఖ్యలవలె నుండును. సరస తరములైన సత్కావ్యములును అట్టివే. కావుననే పురాణ ములు సుహృత్సమ్మితములనియుఁ, గావ్యములు కాంతా సమ్మితములనియుఁ బెద్దలు చెప్పుదురు.

రామాయణ మొక మహాకావ్యము, ఆదికావ్యము ; భారతము నితిహాసమనియు భాగవతమును బురాణమనియు నందురు. కాని యీమూడు మహాగ్రంథములను సాధారణ ముగాఁ బురాణములనియే పేర్కొనుచున్నారు.

ప్రాచీన హిందూదేశ వీరపురుషుల చరిత్రములును, సతీమణుల చర్యలును, ఆయాకాలములందలి సంఘస్థితులును, ఆచారవ్యవహారములును, అప్పటిధర్మములును, సంప్రదాయ ములును—అన్నిటికంటె ముఖ్యముగా—సర్వకాలానుకూలము లై, యిహపరసుఖసాధనములై, సర్వజనావలంబనీయములైన సనాతనధర్మములును, హిందూదేశవిశిష్ట మహోత్తమార్థలక్ష్య ములును, దెలిసికొనఁ గోరువారి, కవి యుపయోగించినట్లిట్టి గ్రంథము లుపయోగపడవు.

కాని యొకచిక్కున్నది. జిగురులోను, పెచ్చులోను, పీచులోను నుండు పనసపండు శ్రమపడియొలిచి, తక్కిన భాగములు త్యజించి తొనలుమాత్రము తినునట్లు, ప్రయాస పడి గనిత్రవ్వి, మట్టిలోను రాలనడుమను నుండు మహారత్న ములఁ గొనునట్లు, పెక్కర్థవాదముల నడుమను, అతిశయో క్తులనడుమను, అసత్యకల్పనముల నడుమను, దేజరిల్లుచున్న యామహాసత్యములను మనము గ్రహించి, యాచరించి, యిట నటఁ గూడ సుఖపడవలెను.

నీరక్షీర విభాగము చేయు హంసవలె, శ్రీరామకృష్ణ పరమహంస స్వామివారి జ్ఞానపుత్రుఁడగు శ్రీవివేకానందస్వా మివారు, తన పౌరాణోపన్యాసములలోఁ, బ్రధానా ప్రధాన విషయముల నెట్లు వేఱుపఱుచుకొని మనము పురాణ పఠన లాభము నొందనలెనో, చెప్పకయ చెప్పినారు.

రెండేండ్లక్రిందట, బాలుర యుపయోగముకొఱకు, అట్టి యుపన్యాసముల నాల్గిటిని దెలిఁగించి "శ్రీవివేకానంద స్వామివారి పౌరాణోపన్యాస చతుష్కము" అనుపేర నొక పుస్తకముఁ బ్రకటించితిని. ఆయుపన్యాసకుని మహిమ బాలు రకుఁ దెలియవలయునను నుద్దేశముతో మద్విరచితమగు "శ్రీవివేకానందస్వామిప్రశంస" యను నొక వ్యాసముచేర్చి పెంచి దానినే "పురాణకథలు" అను నామాంతరమున నిప్పుడు ప్రకటించుచున్నాను.

నిశిత నిష్పక్షపాతబుద్ధితోఁ, సర్వజన శ్రేయోభిలాష తోఁ, జేసిన స్వామి సదుపదేశముల లాభము నాంధ్రదేశ విద్యార్థులందఱును బడసి బాగుపడుదురుగాక !

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు !

పిఠాపురము,
10-1-1927.

కూచి నరసింహము.

## విషయసూచిక.



పొరట.

శ్రీరామ.

# శ్రీవివేకానందస్వామిప్రశంస.

---

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

(భగవద్గీత.)

ఉదారకరుణాచిత్తు లగుమాప్రభువుగారు భగవత్ప్రేరణమున నాకు విశ్రాంతిసుఖ మిచ్చుచున్నారు. వ్యాధి వెనుదీయుచున్న ట్లగపడుచున్నది. మునుపటివలె విశేష శిరోభ్రమణబాధలు లేకుండ, అప్పుడప్పుడు వార్తాపత్రికలు మున్నగునవి చదువుకొనుచున్నాను. ఇట్లుండఁగా నొకనాఁడు "ఓయీ! వెఱ్ఱివాఁడా! నీపుణ్యముచేఁ జివరకు సత్ప్రభుప్రాప్తి దొరకినది అదృష్టవంతుఁడవు. జనసత్వము లుడిగినయవస్థలో నిన్నాయన కంటిని ఱెప్పవలెఁ గాచుచు, నీకుఁ గావలయు నైహికసుఖములు పూర్ణముగా నిచ్చుచున్నారుగదా. నిద్రనుండి లేచి యేదో గొణఁగుకొనుచున్నావు. సరే. ఒకముఱగంటసేపు కాఁబోలు శాంతము తెచ్చుకొనుచున్నావు. అదియు సరే—కాని, నిత్యము ఈ "దుష్కృష్ణకరణి" లేమి? ఈవార్తాపత్రికాపఠనవ్యసనమేమి? భాషాభివృద్ధిచేసికొని యింకను శాస్త్రములు చెప్పి కాసుల నార్జించెదవా? లోకజ్ఞానము బట్టుపఱచుకొని దేశపరిపాలనములోని లోటులను సవరించెదవా? వేదికపై కెక్కి యుపన్యాసగర్జనములు చేసి యుద్యోగములు సంపాదించెదవా? యూళ్ళేలెదవా? యశస్సునకై దేవులాడుచున్నావా? ప్రజలు నిన్నటివఱకు నెత్తిమీఁదఁబెట్టుకొని నేఁడు వనటాగ్రగులతో పాదఘట్టనముఁ జేయుటలేదా? ఖ్యాతియుఁ గాఁ

తాకనకములఁ గాంచిరే యని యనుకొనలేవా ? అదిగాక, నీవేమి లోకమాన్య బాలగంగాధరుఁడవా ? గాంధిమహాత్ముఁడవా ? నీబుద్ధియెంత ? నీశక్తి యెంత ? భక్తిశేషమైన నీబ్రతుకెంత ? చాలు! చాలు! జబ్బు బాధించుచున్నదని, జబ్బునాఁటి యాయుంచుకంతభక్తి యింకిపోఁ జూచుచున్నావా ? ఈసింహావలోకనములను ఖల్లూకావలోకనములను నీకిఁకఁ బనికిరావు. వెనుకచూపు ముందుచూపుగా మార్చుకొనుము. ప్రపంచసృష్టి సాధ్యమైనంతవఱకు తగ్గించుకొని కొంచెము పరమార్థచింతలోఁ బడుము. కొలఁదిగనో గొప్పగనో యితరసుఖము లేఁబదినాలుగేండ్లు చవిచూడనే చూచితివి. రుచిచూడని పరసుఖముకై ప్రాఁకులాడరాదా ?" అని యొక యంతర్వాణి పలికినట్లయ్యెను.

సవరించి వదలిన శ్వపుచ్ఛమువలె మెలికలుదిరిగి, మనసు పాతయొక మార్గముఁ బట్టుచున్నదా యేమి ? అని చూచుకొని, తగినగ్రంథమేదైనఁ జదువఁ దలపెట్టుకొంటిని.

“ భగవద్గీతా కించిదధీతా ” అనుశ్లోకము జ్ఞప్తికివచ్చినది. జ్ఞప్తికి వచ్చినఁ గార్యమేమి ? సంస్కృతము రాదు. నేర్చుకొనరాదా ? ధారణాశక్తి తరలిపోయినది. నిత్యపారాయణము చేసికొనుచు నిర్వాణానంద మొందరాదా ? శుష్కగీతాపారాయణము శుకప్రలాపప్రాయమని, వివేకవిద్యావిసందిగ్ధచిత్తము వెనువెనుకకుఁ బోయినది. కనుక నత్యుత్తమమైన భగవద్గీత యందని పండయిపోయినది.

ఇఁక వేదవేదాంతములు—గీతలు—భాష్యములు—యోగశాస్త్రములు—యావదన్యమతగ్రంథములు—చూచి తెలిసికొని, తెలిసికొన్నవి తీవ్రముముక్షువై యాచరణములోఁ బెట్టి పరీక్షించి చూచుకొని, ముక్తుఁడై ముక్తిసాధనములు పరోపకారార్థము విస్పష్టముగా—నాంధ్రములోఁగాని, యాంగ్లములోఁగాని, వ్రాసిన మహానుభావు లెవరైన నున్నారా ? యని పర్యాలోచనము చేసితిని. అప్పుడు వివేకానందస్వామినామము, విద్యుల్లతవలె హృదయాకాశమునందు మెఱసెను.

ఈయన శ్రీరామకృష్ణపరమహంసగురువర్యుని ప్రియ శిష్యుఁడు, జ్ఞానపుత్రుఁడు. ఆంగ్లసంస్కృతవిద్యాప్రవీణుఁడు. ఆడుకొనువయసునందే యత్యద్భుత భక్తిజ్ఞానవైరాగ్యచిహ్నము లగపఱిచినవాఁడు. మహావక్త. గురువుగారివలెనే, కామినీ కాంచనములను బూర్తిగా జయించినవాఁడు. తాను అమెరికాలో నున్నప్పుడు తద్దేశపు మహాధనికురా లొకయామె, దగ్గఱకువచ్చి "స్వామీ! నాసర్వస్వముతో మీకీశరీర మర్పించుకొనుచున్నాను. మీభార్యగాఁ గైకొని నన్ను ధన్యగాలిని చేయుఁ"డని పలికినప్పుడు నిశ్చలబ్రహ్మచర్యతేజముఁ గ్రక్కు చూపులతో నామెను జూచి "అమ్మా! నేను సన్న్యాసిని. నాకు ధనముతోఁ బనిలేదు. ప్రపంచములోని స్త్రీలందఱు నాకుఁ దల్లులు. నీవొకతల్లివి." అని ప్రత్యుత్తరమిచ్చిన కలియుగ శుకయోగీంద్రుఁడు.

మెడఁబట్టుకొని వంచి చక్కని ముత్యములు డీసికొమ్మని, యెవరైన సముద్రములోఁ దలముంచినప్పుడు, ఉక్కిరిబిక్కిరియై "ఊపిరాడుట లేదు. చచ్చిపోవుచున్నాను. నీ ముత్యములు నాకక్కఱలేదు. బాబూ! మెడవదలి రక్షింపు" మని మనుష్యుఁ డెంతయాతురతతోఁ బ్రార్థించునో, యంత యాతురతతో భవబాధావిముక్తికై భగవంతునిఁ బ్రార్థించిన భక్తశ్రేష్ఠుఁడు.

చిన్ననాఁడే తితిక్షోద్రేకముతో, మహర్షి దేవేంద్రనాథటాగూరుగారియొద్దకుఁ బిచ్చిపట్టినవానివలెఁ బరుగెత్తుకొనిపోయి "మహాశయా! మీరు దేవునిఁజూచినారా?" యని యడిగి యలబ్ధకాముఁడై, శ్రీరామకృష్ణపరమహంసునికడ కేతెంచి, యట్లే ప్రశ్నించి, చివరకుఁ గృతార్థుఁడైన తీవ్రవైరాగ్యసంపన్నుఁడు. చదువుకొనురోజులలో, ఒక యాంగ్లేయ మతబోధకుఁడు రోడ్డుమీఁద విగ్రహారాధనమును దూషించుచు—"నాకఱ్ఱతోఁ గొట్టిన మీవిగ్రహ మేమిచేయఁగలదు ?" అనఁగా "పడఁదిట్టినచో, మీప్రభు వేమిచేయఁగలఁడు?" అన్నశూరుఁడు. "నీవు చచ్చినతరువాత నరకములోఁ బడవేయును" అని కోపించి అతఁడు పలుకఁగా, "మావిగ్రహము, నీవు చచ్చినతరువాత నిన్ను నరకజ్వాలలలోఁ బడవేసి మలమల మాఁడుచును" అని ప్రత్యుత్తర మిచ్చిన మేరుధైర్యుఁడు.

సద్గురుచరణారవిందసేవచే, సమస్తయోగరహస్యములు, సమస్తధ్యానరహస్యములు, అనుభవపూర్వకముగాగ్రహించిన పుణ్యపురుషుఁడు. గురుశుశ్రూష చేయుకాలములో, గురూపదేశప్రకారము, సమాధినిష్ఠుఁడై, తోడిశిష్యుఁడు దోమతాటువను వెలిచి తొలఁగిపోఁగా, గొంగళిగప్పినట్లు దోమలు దట్టముగ మూఁగి దేహమంతయుఁ గఱచినను, కదలక మెదలక అట్లేయున్న యోగాగ్రదిత్తుఁడు.

ఆసేతు హిమాచలపర్యంతము తిరిగి, నానాక్షేత్రములు—నానాతీర్థములు—వివిధ దేవాలయములు—సేవించి, ధ్యానపరిపాకముచే వివిధధ్యానానుభవఫలముల నాస్వాదించిన భక్తశిరోమణి.

బౌద్ధ, జైన, క్రైస్తవ, తురుష్కాది వివిధమతసారములఁ జక్కఁగాఁ గ్రోలిన సముచితుఁడు. తత్తన్మతగురువులను విరాగులను దర్శించి, చర్చించి, చెప్పి, నేర్చి, సర్వమతసామరస్యమును గనిపట్టిన మహోదారుఁడు.

గురుకటాక్షముచేఁ బరమావధియగు నిర్వికల్ప సమాధిసుఖముగూడఁ జవిచూచిన ధన్యాత్ముఁడు. ఆర్షమత సనాతన ధర్మముల ప్రాశస్త్యమును సానుభవముగఁ గనుఁగొన్న సన్న్యాసిసత్తముఁడు. మహాదేశాభిమాని. నిమ్నజాతుల దురవస్థను జూచి పెక్కుసార్లు కన్నీరు విడిచిన కరుణామయుఁడు. మ్లేచ్ఛశబ్ద మెవ్వరు కల్పించినారో అప్పుడే యార్షమతము నడుగంటఁద్రొక్కినారన్న కుశాగ్రబుద్ధి. సత్యగ్రహణచతురుఁడు.

మూలగ్రంథములను అభిమానవ్యాఖ్యాతల దృష్టితోనే చూచుచు భగవద్దత్తమైన స్వబుద్ధి నుపయోగపఱుపక, దేశకాలస్థితిభేదములఁ బాటింపక, కేవల ప్రాచీనత్వమే సార్వకాలిక ప్రమాణముగా గ్రహించుచు, ఆచారమే యామ్నాయమని యనుకొనుచు, అన్యాయములను విశ్వమైత్ర్యభంజకము

బును దేశానర్థదాయకములును, అగు పరంపరాగతములైన కొన్ని అసమంజసాచారములను అభినివేశముతోఁ బ్రవర్తింపఁ జేయువారి బాధయొకటి. ఆంగ్లవిద్యాభ్యాసముచే స్వమత పరిచారములు మాన్పుకొని పరదేశీయులయొక్క పైపైసొబగులకు బ్రమసి, విదేశ వేషభాషాహార విహార వ్యామోహితులై, మసిపాతలోఁ గట్టి దాఁచిన మాణిక్యములవలె నున్న సనాతన ధర్మరహస్యములను గనుఁగొనక, కనుఁగొనలేక, క్రొత్తమతములు సృష్టించి, ఉన్నకాస్తంతయైకమత్యమును దేశమతాభిమానములతోఁగూడ గంగలోఁ గలుపుటకుఁ గ్రొత్తమార్గములు కల్పించినవారి బాధయొకటి. ఈయుభయప్రబలశత్రు బాధావ్యూహమధ్యమునఁ జిక్కి సనాతనమతము శల్యమాత్రావశిష్టమై యున్నదని పరిపరివిధములఁ బరితపించిన పరివ్రాజకచక్రవర్తి.

‘‘ నేఁడు సర్వప్రపంచము నొకయూఁపూపి, గజగజలాడించును’’ అని తనగురుపాళి భావిసూచకముగాఁ బల్కుట కర్హుఁడై పుట్టినవాఁడు. అమెరికా యూరప్పులలో నట్టి నిష్కళంకప్రవర్తనముతో, నిరుపమానవక్తృత్వముతో, నిష్పక్షపాతయుక్తివాదములతో, అసాధారణమేధాసంపత్తితో, అనన్యసామాన్యవైదుషీమహిమతో, అద్వైతబోధనముఁ గావించి అనేక ప్రసిద్ధస్త్రీపురుషులను శిష్యురాండ్రఁగాను శిష్యులఁగాను జేసికొని వైదికమతోత్కృష్టతను స్థాపించి అన్యదేశ

ములలో ఆష్టమతజ్ఞానోభాశ్రమముల నెలకొల్పిన మహాప్రతిభాశాలి.

ఇట్టి శ్రీవివేకానందస్వామి అపరశంకరాచార్యుండు కాండా? పురూప సరస్వతికాండా? మనదేశమాత పుత్రరత్నముకాండా? ఆర్యావర్తమహాతపఃఫలముకాండా? కానియే, నే ననుకొనుచున్నాను. పెక్కుర ట్లే తలంచుచున్నారు.

ఆత్మవిద్యావిషయకమైన సంశయములు నివృత్తిచేసి కొనుటకై, బ్రహ్మసాక్షాత్కారముకై, శ్రీవివేకానందస్వామి పడినపాట్లిన్నన్ని కావు. ఎన్నితపస్యలు! ఎన్ని యోగసాధనములు! ఎంతకాలము చేసినాండు, పాపము! గురుదేవుని ఛాయాప్రతిమ, భగవద్గీత, దండకమండలువులు, భిక్షాపాత్రి, కాషాయచేలము—ఇవితప్ప మఱియొండు లేకుండ, నెన్నియడవులు గుహలు చొచ్చినాండు! ఎన్నితీర్థములలోం గ్రుంకినాండు! ఎందఱు సిద్ధపురుషులను సేవించినాండు! కొంకుజంకులు లేకుండ, నెన్నిప్రశ్నలు వారికి వేసి, వారు చెప్పినట్లు చేసి, సందేహపరంపరలు దీర్చుకొన్నాండు! అన్నపానములు లేక యప్పుడప్పు డెన్నిరోజులు పర్వతారణ్యములలోం బర్యటనము చేసినాండు! సర్వసామాన్యమైన భుక్తికే యెంతో శ్రమపడవలెనుగదా! ముక్తికై యెంతశ్రమపడవలయునో ముక్తపురుషులే చెప్పవలెనుగాని యితరులెట్లు చెప్పంగలరు? ఆత్మజిజ్ఞాసువకు అభీష్టసిద్ధికిం బూర్వము, అనేకబాధలు పడుటతప్పదు.

దివ్యమోహానందమునకై యెంతకష్టము పడినాఁడో, దేశమున్నోద్ధరణమునకై యంతకష్టముపడినాఁడు. అందుకై తన శక్తి, తనబుద్ధి, గురుకటాక్షసమార్జితమైన తన యమూల్య తత్త్వజ్ఞానధనము, తనప్రాణము ధారవోసినాఁడు.

అనేక సంస్థానాధిపతులు శిష్యులై ధనము లర్పించుకొందుమన్న, వలదు వలదని వదలివేసినాఁడు. మూఁడునాళ్లకంటె ఎక్కువగా సన్న్యాసి యొకచోటనుండఁగూడదని, పాముజూచి పాఱిపోవు బాలునివలెఁ, బెక్కుసార్లు తనకు సేవచేయుచుండు ధనికశిష్యులనుండి తరలిపోయినాఁడు. ఇది అమెరికాకు వెళ్లకపూర్వము స్వామి మనదేశములోఁ బరివ్రాజకవృత్తిలోనున్నప్పటిమాట.

గురువునొద్ద సాధనములు చేయుచున్నప్పుడనేకయోగమహిమలు వచ్చినను, నవి మోక్షావరోధకములని తాఁ ద్యజించుటయే గాక, నాయట్లె మీరును జేయుఁడని తనశిష్యులకుఁ బెక్కుసార్లు నొక్కినొక్కి బోధించినవాఁడు.

మైసూరుమహారాజుగారొకనాఁడు మిక్కిలి గౌరవించి తనప్రక్క నుచితాసనమునఁ గూరుచుండఁబెట్టుకొని, చనవుతో "స్వామీ! మాసంస్థానములోని దివాను, సన్నిధానవర్తులును, ఎట్టివారు?" అని వారియెదుటనే యడుగఁగా, "అన్ని సంస్థానములలోను నెట్లున్నారో, యిచటను అట్లేయున్నారు" అని జంకులేక పలికినాఁడు. అంత, మహారాజాయనను లోపలికిఁ

దీసికొనిపోయి " మహాత్మా ! గొప్పవారని మోమోట మించుకయు లేక, సమ్ముఖముననే వారినట్లు పరాభవించితిరే ! " యని పలుకఁగా, " మహారాజా ! నీవు నన డిగితివి గానఁ, బ్రత్యుత్తర మీయవలసివచ్చెను. సన్యసించినతరువాత నైనను సత్యమాడవలదా ? నన్నుఁగూర్చి నీవు మాయఁ డడిగినను, ఉన్నదున్నట్లు చెప్పువాఁడనే ! " యని నిర్భీకుఁడై జవాబిచ్చెను.

ఒకనాఁ డీయనయును, ఇద్దఱు గొప్ప యాంగ్లేయులును, ఒకబండిలోనే కూరుచుండి రెయిలుప్రయాణము చేయవలసి వచ్చెను. స్వామికింగ్లీషుభాష రాదనుకొని సాధువులు దొంగలని, వంచకులని, సోమరిపోతులని, తిరిప్పాలని, ఆయువు వృథ, నోటికివచ్చినట్లు వారిభాషతో దూషించుచుండిరి. స్వామి నిశ్చలచిత్తుఁడై మీలితనయనుఁడై యూరకుండెను. అంతట నొక స్టేషనుకడ ఈముగ్గురును దిగిరి. దాహమగుచున్నది, కొంచెము మంచినీళ్ల మిప్పించెదరా ? యని స్టేషన్మాస్టరుగారిని స్వామి యింగ్లీషుభాషతో నడిగెను. అది విని దొరలాశ్చర్యపడి యాడినమాటలకు నొచ్చుకొని, " ఏమయ్యా ! యింగ్లీషువచ్చియూడ, మేమన్నమాటలు మిమ్మన్నప్పుడు మిన్నకుంటిరి ? " అని యాంగ్లేయభాషతో సాంత్వనవచనములాడిరి. " మూర్ఖులను జూచుటకు, మూర్ఖప్రసంగములు వినుటకు, నాకిది మొదటిమాటుగాదు " అని స్వామి యింగ్లీ

షుణ్ణోనే జవాబిచ్చెను. ద్వారకులకుఁ గోపమువచ్చి కనులెఱ్ఱ పడెను. అప్పుడాసిక నేను సన్న్యాసినై యున్నానని చెప్పి నట్లు స్వామి ఓమ్మనిపించి, యినుపముద్గలవలె నున్న చేతి కంకణలను వారిద్దరి పృష్ఠభాగమునఁ బడవైచెను. ఇంక మర్యాద దక్కదని యాఁగోలు క్షమింపుమని పల్కి మఱి మాటాడక ద్వారగాండ్లు వారివారిని వారు తొలఁగిపోయిరి.

“శివోహ”మ్మను వాక్య మనుభవమునకుఁ దెచ్చు కొనఁగోరి జీవేశ్వరైక్యానుసంధానమునకై చేయు ప్రయత్నము లలోఁ బైమెట్లు పట్టుపడనప్పుడును, అమోఘమైన దేశోద్ధ రణసాధనము మనస్సునకుఁ దట్టనప్పుడును, స్వామి గిజగిజ కొట్టుకొనుచు — “ఓ శ్రీరామకృష్ణభగవానుఁడా! ఓ తల్లీ! జగ జ్జననీ! మీబిడ్డలకు సరియైనవారి మాకై కృతకృత్యునిఁ జేయ రా? మీ మాతృదేశము చేసెదా శిరసావహించి నెఱవేర్పఁ ద్రిక రణశుద్ధిగా దీక్షవహించితిని. కరుణించి రక్షింపుఁడు. మీయ నంత తేజస్సును నాకు బ్రసాదింపుఁడు!” అని భక్తిబాష్ప ములు పడవైచువాఁడు, శ్రీరామకుమారి యాలయమున్నగు పవిత్రస్థానములలో, నెన్నో నాళ్లుపవసించినాఁడు. అటుపిమ్మట తుదకుఁ దనయభీష్టసిద్ధికిఁ గావలసిన జ్ఞానతేజోబలములను బూర్ణముగా సంపాదించుకొన్నాఁడు. సంపాదించుకొని సత్సం కల్పములు నెఱవేర్చుకొని శాశ్వతకీర్తిఁ బడసినాఁడు.

ఇట్టి మహాపురుషుని చరిత్ర చదువుట మహాభాగ్యము.

సన్న్యాసికి భిక్షాటనమేల ? నీవు పేదల బాధించి నేఁడిటనందు వలన ఫలమేమి ? పిడికెఁడు బియ్యము మిగిలినఁ బేదవారి బిడ్డ కొకముద్ద దక్కునదన్న మాటగదా ! పరమాత్మావలోకనము నకుఁ బనికిరాని యీపాడు శరీరమును నే నేలకాపాడుకోవ లెను ? ఛీ ! ఛీ ! ఇఁక నీవృత్తి మానెదను. పూర్వముముక్షు వులపూతను బోయెదను. అన్నముతినక, నీళ్ళుత్రాగక, ప్రయాణపరిశ్రమలచే ఈరక్తమాంసాస్థివశాయమైన దేహమును శుష్కింపఁజేసి దారిలోనచటనో వ్రాల్చెదను—"
అని వివేకానందస్వామి తలఁచుకొని, దృఢనిశ్చయుఁడై, యొకమహారణ్యములోఁ జొరఁబడి, నీరాహారములు వర్జించి, పగలంతయు నడచి, శ్రమచే నిఁకఁ గాలుసాగింపలేక, సాయంసంధ్యాసమయమున నొకచెట్టుక్రిందఁ జతికిలఁబడెను. చతికిలఁబడి, సర్వాంతర్యామి యగు భగవంతునిపై మనసుపెట్టుకొని, తదేకదృష్టితోఁ జూచుచుండెను.

ఇట్లుండఁగాఁ గొంతసేపటికొకపెద్దపులి దూరమునఁ గనఁబడెను. క్రమక్రమముగా దగ్గఱదగ్గఱకు వచ్చి, అది కొన్నిగజములదూరమున ఆఁగి అచటఁ గూర్చుండెను.

స్వామి యాశ్చర్యపడి, "సరే ! బాగుగనేయున్నది. మనమిద్దఱముకూడ మిక్కిలి యాఁకలిగొనియున్నాము. ఈశ్వరసాక్షాత్కారమున కుపయోగింపని యీతనువువలనఁ

బ్రపంచమున కేమియులాభములేదు. ఇట్టిదానితో నాకు మాత్ర మేమిపని? క్షుద్బాధచే నకనకఁబడియున్న నీకుక్షి గహ్వరములోఁ బడినచో దీనిజన్మము కొంత సార్థకమగు నేమో?" అని తలపోసెనని. పులి శోనినిమిషమునవో తనమీఁదఁబడి తన్నుఁ దినునని నిశ్చయించుకొని, నిశ్చలుఁడై, నిర్భయచిత్తుఁడై, మొనపైని తనతను మనసుఁ బెట్టుకొనెనో, ఆయనపైనే దానిని గట్టిగా లగ్నముచేసి, నిర్వాణ క్షణమును నిరీక్షించుచుండెను.

కాని, కూరుచుండికూరుచుండి యేకారణముననో, పులి చటుక్కున లేచి మఱియొక్క త్రోవను బట్టి పోయెను. పోయినప్పటికిని, అది మరల వచ్చి తన్నుఁ *బళించుట తప్ప దనుకొని, స్వామి ప్రతినిమిషమును దానికై వేచికొనియుండెను. ఎంతసేపు కనిపెట్టుకొనియున్నను, అది వచ్చి తిరుగఁ గనఁబడలేదు. అతఁడు రాత్రియంతయు ఆచెట్టుక్రిందనే పరుండి నిద్రపోయెను. తెల్లవారెను. అపూర్వమైన శరీరబలముతోను, అత్యంతమైన మనోబలముతోను స్వామి నిద్రలేచి తరలిపోయెను. ఆఁకటిచేతను, దప్పిచేతను, కాలినడకచేతను ఎంతో బడలి సొలి చతికిలఁబడిన సన్న్యాసికి, అట్టిదేహబల మనోబలము లెట్టువచ్చెనో, ఎవరిచ్చిరో, వివేకానందస్వామి కెఱుక! స్వాములకెల్లరకును స్వామియగు ఆస్వామి కెఱుక!

క్రూరుడగు నా[illegible] "స్వామీ! ఇటు చూడుము! ఆహా! ఏ తినుబండములివి! ఎంతరుచిమంతములైన లడ్డుమిఠాయియుండలు! ఈపూరీలు చూడుము! ఏమిమృదువైనపూరీలు! ఇవన్నియు నేను ఆహ్వానముగాఁదిని దివ్యానందభరితుఁడ నౌచున్నా నే! నీగ్రహచారమేమి కాలినది? సన్యాసము పుచ్చుకొని యేమిబావుకొనుచున్నావయ్యా? మన్విగ్రహములాగున నుంటివిగదా, ఏదోపనిచేసికొని, డబ్బు సంపాదించుకొని సుఖపడరాదా? అర్థపరిత్యాగము అనుత్యాగములోనికి దింపదా? ధనహీనుఁడు బుద్ధిహీనుఁడుగాఁడా? చేయు, జేబును వట్టివైనప్పుడు, పొట్టమాత్రము వట్టిదిగా నుండదా? విత్తమునలవన్ని వెట్టివెంగళప్పకీశాస్త్రి కావలసినదే, ఇంకెను గావలసినదే! చూడుము! కూర్చుండుటకు నాకీ స్నిగ్ధచిత్రాసనము—నీకు కనకనలాడు కటికినేల! తినుటకుఁ ద్రాగుటకు నాకు మంచిమంచిభక్ష్యపానీయములు—నీకు మాఁడెడు కడుపు, ఎండెడుగొంతుకయును! తెచ్చిపెట్టుకొన్న కష్టమును తృప్తిగా తీఱికగా అనుభవించుము" అని పాప! మావర్తకుఁడు స్వామిని ఊరకుండనీక పిలిచి, దెప్పుచు, పెదవులు బిగించిచూచుచు, పకపకనవ్వుచు, లొట్టలువేసి తినుచు, గుటకలువేసి త్రాగుచు, తెగఁద్రేన్చుచుఁ బహువిధముల బాధపెట్టుచుండెను.

శుద్ధసత్వస్వభావుఁడగుస్వామి యాపరిహాసవాక్యముల

కును, అవజ్ఞాక్షేపితములకును, ఏమాత్రమును గినియక, చలింపక, తితిక్షావిగ్రహమువలెఁ గూర్చుండెను.

అంతలో నాగాశ్రమనివాసియే యొకఁడు, కుడిచేత నొకమూటయు లోటయును, ఎడమచేత శీతలసుగంధిసలిలపూర్ణమైన యొక మట్టికూజాయును బట్టుకొని, కక్షములో నొక తెల్ల చిన్నదుప్పటియును, ఆస్తరణమున కుపయోగించు నొక చిన్న మెత్తయును బెట్టుకొని, పరుగుపరుగున వచ్చి, స్టేషనులోఁ జొచ్చి, శుభ్రమైన యొకచోట దుప్పటిపఱచి, మూట విప్పి, యందలి వివిధభోజనపదార్థములను దానిపైనమర్చి స్వామికడకు సంభ్రమముతో నొగరుచుకొనుచు వచ్చి, "బాబాజీ! దయచేసి యిటువచ్చి, తమకు నేఁదెచ్చినయాహారమును వేగ భుజింపుఁడు." అని ప్రార్థించెను.

అవన్నియు నెటుప్రాపించెనో, తెచ్చినయాతఁ డెవఁడో, యణుమాత్రము నెఱుఁగని స్వామి యాశ్చర్యమును, ఇంతవఱకు నపరిమిత పరిహాసములు చేయుచు, ఇప్పుడు వెలవెలఁబాఱినముఖముతో, దాకనోటితోఁ, దెఱచినకన్నులు మూయకుండఁ, జూచుచు నిర్జీవప్రతిమవలె నున్న వర్తకుని యాశ్చర్యమును, ఎవఁడు మాటలతో వర్ణింపఁగలఁడు?

క్రొత్తగావచ్చినతఁడు "బాబాజీ! ఆలస్యము చేయకుఁడు! వచ్చి వెంటనే భుజింపకతప్పదు." అని స్వామినిబతిమాలి బలవంతపెట్టుచుండెను.

స్వా—మిత్రమా! నీవేదో పొరపాటు పడుచున్నట్లున్నావు. ఒకనినిజూచి ఒకఁడనుకొనుచున్నావేమో! నిన్నెన్నఁడును జూచినట్లు నాకు జ్ఞప్తిలో లేదు.

గ్రా—సరిసరి! బాబాజీ! నేను మిమ్ముఁజూచితిని, చూచితిని, పొరపాటేమియు లేదు. (నర్తకుఁడు తెల్లనోరు వెట్టుకొని చూచుచుండెను. స్వామి యతివిస్మయముతో నిట్లు పలికెను.)

స్వా—అయ్యా! నీమాటలు నాకు దురవగాహములుగానున్నవి. నన్నెక్కడఁజూచితివి?

గ్రా—బాబాజీ! వినుఁడు. నే నీయూరి మిఠాయివర్తకుఁడను. ప్రొద్దున భోజనముచేసి, మామూలుగా, పక్కపైఁ బరుండి కొంచెము కన్నుమూసితిని. అంతట నొకస్వప్నము వచ్చెను. అందు శ్రీరామచంద్రమూర్తి నిన్ను—సరిగా నీ వంటిరూపమునే—వ్రేలుపెట్టి చూపి "అదిగో! వాఁడు, నీ యెదుట నగపడువాఁడు, నిన్నటినుండి తిండి లేక, బాధపడుచున్నాఁడు. ఆ బాధయంతయు నేనును బడుచున్నాను. వెంటనే లేచి, పూరీలు కూరయుచేసి యవియును, మిఠాయియును, చల్లని మంచితీర్థమును, కూరుచుండుట కొక చిన్నమెత్తయును రైలుస్టేషనుకుఁ బట్టుకొనివెళ్లుము లెమ్ము." అని పలికెను. నేను మేలుకొంటినిగాని, అదియేదో సామాన్యపుకలయని యలక్ష్యము చేసి, ప్రక్కకు ఒత్తిగిల్లి, మరలఁ బరుంటిని. అంత

ట, అపారకృపాసముద్రుండగు శ్రీరామచంద్రప్రభువు, తిరుగ నిద్రలో నగకకి—"ఓరీ! ఏమిరా! త్వరగా లేచి నేఁజెప్పి నట్లు చేయు వేమిరా?" అని నన్నుఁ బొడిచి లేపినట్లయ్యెను. ఇఁక నే నెట్లుపేక్షచేయఁగలను? ఉలికిపడి లేచి, శీఘ్రముగా పూరీలను కూరలును జేసి, అవియును తత్పూర్వమే చేయఁబడి సిద్ధముగానున్న మంచిమిఠాయియును, గుమగుమలాడు చల్లని మంచితీర్థమును, ఒక చిన్నమెత్తను పట్టుకొని, వేళ మించిపోవునేమోయను భయముతో, తిన్నగా ఇచ్చటికి పరు గుపరుగున వచ్చితిని. వచ్చి, స్వప్నములో సాక్షాత్కరించిన రెండవమహానుభావుని—మిమ్ము—దూరమునుండియే చూచి ఆనవాలుపట్టితిని. పొరపాటుమాత్రమును లేదు. కనుక దయ చేసి వేఁడి చల్లారకముందే, తెచ్చినవి ఆరగించి నన్ను ధన్యు నిజేయుఁడు. మీరు మిక్కిలి క్షుద్బాధతో నున్నారు. ఇఁక నాలస్యము చేయకుఁడు.

(వెంటనే స్వామి వెళ్లి సంతృప్తిగా భుజించి, కడుపు నిండఁ జల్లని మంచితీర్థముద్రావి, మిఠాయివర్తకునికిఁ గృతజ్ఞ తాభివందనము లర్పింపఁబోఁగా.)

గా—అదేమిబాబాజీ! వలదు, వలదు! వందనములు నాకా? అంతయు శ్రీరామచంద్రభగవానుని యిచ్ఛాప్రకార ము, ఆజ్ఞప్రకారము, జరిగినది. ఆయనకు సమర్పింపుఁడు.

అన్నిపరిహాసములు చేసి స్వామిని పరాభవించిన వర్తకుఁడు పిడుగుపడినవానివలెఁ గొంతసేపు నిశ్చేష్టితుఁడై యుండి పిమ్మట స్మృతికివచ్చి, బుద్ధితెచ్చుకొని, పశ్చాత్తప్తుఁడై, క్షమింపుఁడని స్వామిపాదములపైఁ బడి, పాదరజముతీసి బొట్టు పెట్టుకొనెను.

స్వామి విస్మయానందభరితుఁడై, విచ్ఛిన్నసంశయుఁడై, కనుఁగవనుండి పూర్ణపూతభక్తిబాష్పములు కాలువలుగా చెక్కులంటి ప్రవహింప, పైనివ్రాసిన భగవద్గీతాశ్లోకరాజమును స్మరించుకొనెను. స్మరించుకొని, "పరమేశ్వరా! మార్జాలకిశోరన్యాయముగా నిన్నే నమ్ముకొన్నవారికి, బాధలన్నియును తటాపంచలౌనుగదా!" యని నిశ్చలమనస్కుఁడై ధ్యానించుకొనియుండెను.

శ్రీరామచంద్రా!

(కాలిఫర్నియా యందలి పాసడీనాయందలి షేక్స్పియర్సంఘ
కార్యస్థానమున 1900 సం॥ జానువరి 31 వ
తేదీ నిచ్చిన యుపన్యాసము.)

# శ్రీమద్రామాయణము

సంస్కృతభాషలో వీరపురుష చారిత్రగ్రంథములు గొప్పవి రెండున్నవి. అవి మిక్కిలి పురాతనములు. పద్యరూపముగా వ్రాసిన యితరములైన యితిహాసము లనేకములున్నవి. కడచిన రెండువేల యేండ్లపైనుండియు జనులు సంస్కృత భాష మాటాడుకొనుట మానివేసినారు. అయినప్పటికిని ఆభాష నేటివఱకు నిలిచియున్నది. ఇప్పటికిని దానిలో గ్రంథములు వ్రాయుచున్నారు. అతిప్రాచీనములైన రామాయణ మహాభారతములను రెండు ఇతిహాసములం గూర్చి మీకు నే విశదము చెప్పంబోవుచున్నాను. పూర్వకాలపు హిందువుల ఆచారవ్యవహారసంప్రదాయములు, అప్పటి ప్రజల స్థితిగతులు, వారి నాగరికత, మున్నగు విషయములు అందున్నవి. ఈచరిత్రలలో ప్రాచీనతమమైనది రామాయణము, రామచరితము అందు వర్ణింపబడినది గనుక దానిని రామాయణమన్నారు. అంతకుముందుగూడ పద్యాత్మకమైన కొంత గ్రంథజాలముండెను:—హిందువుల పవిత్రగ్రంథములైన వేదములం

క్షించి యీపాపమంతయుఁ గట్టుకొనెదవు ?" అని మునీశ్వరుఁడు ప్రశ్నవడిగెను. " అట్లడిగెదవేమి ? ఈ పాపమ్ములో నాకుటుంబభరణము నేఁజేసి కొనవలసి యున్నది." అని తస్కరుఁడు చెప్పెను. " సరే! నీకుటుంబమువారు నీ పాపములోఁ గూడ భాగస్వాము లౌదురనుకొనుచున్నావా ?" అని నారదుఁడు ప్రశ్నించెను. " తప్పకుండ నాకు నాపాపమును బంచుకొనెదరు" అని పంచుదొంగ ప్రత్యుత్తరమిచ్చెను. " మంచిదే! నేను జాఁ పోకుండ నన్నిల గట్టిగాఁ గట్టి పదిల పఱుచుకొని, నీవు నీయింటికి వెళ్ళి, దోఁపుడు ధనములోవలెనే నీ పాపములోఁ గూడ నాలిపాలు వారనుభవింతురేమో నీ కుటుంబమువారి నడిగి రమ్ము." అని నారదుఁడు చెప్పెను. అట్లుచేసి దొంగ వెళ్ళి తన తండ్రి నిట్లడిగెను:—" నాయనా! నిన్ను నేనెట్లుపోషించుచున్నానో యెఱుఁగుదువా ?"

తండ్రి—నే నెఱుఁగను.

దొంగ—నేను దొంగను. జనుల దోఁచుకొని చంపుచున్నాను.

తండ్రి—అయ్యో! అట్లు చేయుచున్నావురా బిడ్డా ? జాతిభ్రష్టా! లేచిపొమ్ము!

తరువాత దల్లిదగ్గఱకుఁ బోయి " అమ్మా నిన్ను నేనెట్లు పోషించుచున్నానో నీకుఁ దెలియునా ?" అని యడిగెను.

త—నాకుఁ దెలియదు.

దొం—చౌర్య హత్యలు చేసి.

త—అయ్యయ్యో! ఎట్టి ఘోరకృత్యములు చేయుచున్నావురా నాయనా!

దొం—నా నిమాట కేమిగాని, నా పాపములో పాల్గొనవా?

త—ఏల పాల్గొనవలెను? నే నెన్నఁడును దొంగతనము చేయలేదే!

పిమ్మట ప్రియురాలి యొద్దకు వెళ్లి

దొం—మిమ్ముఁ బిడ్డలను నే నెట్లు పోషించుచున్నానో యెఱుఁగుదువా?

భార్య—ఎఱుఁగను.

దొం—దారిగొట్టు దొంగనై పెక్కండ్రనుండి ప్రజలను దోఁచుకొనుచున్నాను. ఈరీతిగా మిమ్ముఁ బిడ్డలను బోషించి సుఖపెట్టుచున్నాను. నా పాపము పంచుకొనుటకు నీవు సంసిద్ధురాలవై యున్నావో లేవో—అది నేనిప్పుడు తెలిసికొనఁ గోరినది.

భా—అట్లెన్నటికిని జరుగదు. నీవు నాభర్తవు, నన్నుఁ బోషించుట నీకు విధి.

“ఆహా! ప్రపంచము తీరిట్టిదేకదా! ఎవ్వరికోసము నేఁ జోరవృత్తి నవలంబించితినో వారే—ఆప్తహితబంధువులే—నాపాపఫలములో వంతుగొనుట కిచ్చగింపకున్నారు” అని

దొంగ కనువిచ్చి చూచుకొని పరమయోగిని బంధించిన తావునకుఁ దా మరలఁ జని, కట్లు విప్పి, ఆయనపాదములపైఁ బడి, జరిగిన దంతయు విన్నవించుకొని "రక్షింపుము! రక్షింపుము! నేఁ జేయవలయున దేమి?" అని ప్రార్థించెను. అంతట నాతనుఁ డిట్లు సెల విచ్చెను:—నీప్రస్తుత జీవనమార్గమును పరిత్యజింపుము. నీకుటుంబములో నెవరికిని నీపై నిజమైన ప్రేమ లేదని కనుఁగొంటివి కదా! కనుక ఈపిచ్చినమ్మకము లన్నిటిని విడిచిపెట్టుము. సంపద్దశలో అందఱు నీభాగస్వాములే కాని లేమివచ్చునిమిషమందే నిన్నందఱు విడిచి లేచిపోదురు. నీనుంచి పంచుకొనుట కందఱును ఉందురుగాని చెడ్డఁ బాలుగొనువాఁ డొకఁడును గనఁబడఁడు. కావున మనము మేలుచేయుచున్నను కీడు చేయుచున్నను వీడక మన కండయై యెవఁడు నిలఁబడి యుండునో ఆయొక్కనిని సేవింపుము. ఆయన మనల నెన్నఁడును విడనాడఁడు.

ఎందుచేత? ప్రేమలో వినిమయస్వలాభవాంఛ లుండవు గనుక! దానివలన నెవ్వఁడును అపకర్షస్థితి కెన్నఁడును రాఁడు గనుక!

తరువాత ఋషి తపోవిధాన మతనికి బోధించెను. దొంగ అన్నియుఁ ద్యజించి అడవికిఁ బోయి అట ధ్యానప్రార్థనలు తదేకనిష్ఠతోఁ జేయుచుఁ దన్నుఁ దాఁ బూర్తిగా మఱచియుండెను; చీమలు తనచుట్టును పుట్టలు పెట్టినప్పటికిని అతని

కశేమియుఁ దెలియకుండెను. అట్లు పెక్కువత్సరములు గడచినపిమ్మట నొకనాఁడు "మునిసత్తమా, లెమ్ము!" అను కంఠధ్వని యొకటి అతనికి వినఁబడెను. స్మృతికివచ్చి "మునిసత్తముఁడనా! మ్రుచ్చువాఁడను!" అని యతఁ డనెను. "ఇంకను ఎక్కడిదొంగవు నాయనా? పూతుఁడవై పుణ్యర్షివైనావు, నీపూర్వనామము పోయినది. గాఢతపోధ్యాననిమగ్నుఁడవై నిన్నుఁ జుట్టుకొనియున్న పుట్టలనుగూడ ఎఱుఁగకుండ నుంటివిగాన ఇంతటినుండి నిను వాల్మీకి యందురు." అను ప్రత్యుత్తరము వచ్చెను. (వాల్మీకి యనఁగా వల్మీకసంభవుఁడు—పుట్టను బుట్టినవాఁడు) ఇట్లాదొంగయే ఋషియైనాఁడు.

అతఁడు కవియెట్లయ్యెనో యిఁకఁ జెప్పెదను. ఒకరోజున వాల్మీకి పుణ్యగంగానదిలో స్నానము చేయుటకుఁ బోవుచుండఁగా, చక్రముదిరుగుచు నొకదాని నొకటి ముద్దుపెట్టుకొనుచు క్రీడించుచున్న యొకగువ్వజత యతనికగపడెను. కనులు పైకెత్తి యాపక్షిమిథునమును గాంచి యతఁడు సంతోషించుచుండఁగానే వాయువేగముతో నొక యమ్ము తనప్రక్కనుండి పోయి మగపిట్టను గొట్టిచంపెను. చచ్చి నేలఁబడిన చెలువుని దేహముచుట్టుదిరుగుచు ఆఁడుపిట్ట విలపించుచుండెను. వెంటనే దుఃఖార్తుఁడై వాల్మీకి వెనుకకుఁ దిరిగిచూడఁగా నొకకిరాతుఁడు గాన్పించెను. అంతట "దయాలేశమైనను లేని దురాత్మా!

ఘాతుకమైన నీచేతిని దంపతిప్రేమమైనను ఆపఁజాలదయ్యెను" అను మాట లవశముగా అతనినుండి వచ్చెను. "ఏమిది? ఏమనుచున్నాను? ఇంతకుముందెన్నఁడును ఈరీతిగాఁ బలుకలేదే!" అని యతఁడాశ్చర్యపడి యనుకొనుచుండఁగా ఆకాశవాణి యిట్లు పలికెను:—భయపడకుము, నీనోటినుండివచ్చుచున్నది పద్యము; లోకోపకారార్థము శ్రీరామచరిత్రము శ్లోకరూపకముగా రచింపుము. ప్రపంచములో ప్రథమశ్లోక మిట్లు పుట్టినది. ప్రథమకవియైన వాల్మీకినోటినుండి అది దయాప్రేరితమై వచ్చినది. అటుపిమ్మటనే అతఁ డతిమనోహరమైన రామాయణము రచించినాఁడు.

పూర్వకాలమందు హిందూదేశములో అయోధ్య యను నొకపట్టనముండెను. అది యిప్పుడుకూడనున్నది. అది యున్నరాష్ట్రమును ఇప్పు డయోధ్యారాష్ట్రమందురు. మీలోఁ బెక్కురు దానిని హిందూదేశపటములోఁ జూచియుండవచ్చును. అది ప్రాచీనాయోధ్య. పూర్వకాలమందు దానిని దశరథుఁ డనునొకరాజు పరిపాలించెను. ఆయనకు ముగ్గురు రాణులుండిరి గాని వారివలన సంతానము గలుగలేదు. హిందూదేశశిష్టజనానుసారముగ ఆ రాజును, రాణులును, సంతానార్థము ఉపవసించుచు దేవతల నుపాసించుచు తీర్థయాత్రలు వెళ్లిరి. యుక్తకాలమున నలుగురు కొడుకులు పుట్టిరి. వారిలో శ్రేష్ఠుఁడు రాముఁడు.

యథావిధిగా, ఈనలుగురన్నదమ్ములును, సమస్త విద్యలలోను, సంపూర్ణసుశిక్షితులైరి. భావికలహము లేమియు రాకుండ రాజు తనజీవితకాలములోనే తనపెద్దకొడుకును అనంతరాధికారిగా ఎన్నుకొనుట హిందూదేశ ప్రాచీనాచారము; అతనిని యువరాజింతురు. యువరాజనఁగా పడుచు రాజు.

ఆకాలములో జనకుఁడను మఱియొకరాజుండెను; ఆయనకు సీతయను పరమసుందరియగు నొకకూఁతురుండెను. ఆమె యొక పొలములో దొరకెను. భూపుత్రికయగు నామెకుఁ దలిదండ్రులు లేరు. ప్రాచీనభాషయగు సంస్కృతములో సీత యనఁగా నాఁగటిచాలు అనియర్థము. జననీజనకులలో నెవరో యొకరు లేకుండఁగను, ఉభయులును లేకుండఁగను, హోమకుండములు పొలములు మున్నగు వానినుండి—మేఘముల నుండి యూడిపడినట్లు—పుట్టినవారు పురాతన హైందవ పురాణములలోఁ గాన్పించుచున్నారు. అట్టి అతిమానుష్యాద్భుత జననములన్నియు సామాన్యముగా హిందూదేశపురాణగాథలలో నుండును.

భూసుత గావున, సీత శుద్ధస్వభావురాలు. జనకభూపతి ఆమెను పెంచి, యుక్తవయస్సు రాఁగానే, ఆమెకుఁ దగిన వరునిఁగనుఁగొనఁగోరెను.

హిందూదేశములో స్వయంవరమను నొకప్రాచీనాచారముగలదు; అందు రాజకన్యలు స్వయముగాఁ దమపతుల నెన్నుకొనెదరు. దేశములో నానాభాగములనుండు పెక్కురాజులను స్వయంవరమునకుఁ బిలుతురు. చక్కనిబట్టలు గట్టుకొని దివ్యమైన నగలుపెట్టుకొని చేతిలో నొక పూలమాలపట్టుకొని రాచకన్నె వచ్చును; ఆమెతోఁగూడ నొక ఘోషకుఁడుండును; కన్యాకాములై వచ్చినరాజులలోని ప్రతివానిస్వరూప స్వభావములను విశిష్టలక్షణములను అతఁడు ప్రకటించుచుండును; వచ్చి యెదుటఁగూడిన రాజబృందము మధ్యమునుండి ఆమెపోవుచు ఆమెకునచ్చిన రాజపుత్రుని మెడలో పూలదండవేసి యతనిఁ దనభర్తగా నెంచుకొనును. అంతట వారిరువురకు మహావైభవములో వివాహము జరుగును.

సీతాపాణిగ్రహణ తత్పరులైన క్షితిపతులనేకులుండిరి; హరధనుస్సను నొకపెద్దవిల్లుండెను. దానిని విఱువఁగలవాఁడే తూమెను పెండ్లియాడఁ దగ్గుఁడగునని నియమ మేర్పఱిచి ఆస్వయంవరములో నొకపరీక్షఁ బెట్టిరి. అపని చేయుటకు రాజులందఱును ఉపయోగించిన తమయావచ్ఛక్తియు వ్యర్థమైపోయెను; చిట్టచివరకు రాముఁ డామహాకార్ముకమును తన చేతఁ బుచ్చుకొని అవలీలగా దానిని విఱిచి రెండుముక్కలు చేసెను. అంతట సీత దశరథపుత్రుఁడగు రాముని తనభర్తగా

సెన్నుకొనెను. కరతూసంతప్రదములైన వేడుకలతో వారికి పరిణయములయ్యెను. తరువాత పెండ్లికూతును రాముడు తన యింటికి దీసికొని వెళ్ళెను. వృద్ధుడైన తాను రాజ్యభారవహనమునుండి విరమించి రాముని యువరాజుగా జేయుతఱి వచ్చినదని ఆయనతండ్రి తలంచెను. తదనుసారముగా యువరాజ పట్టాభిషేకమునకు సర్వము సిద్ధపఱుపఁబడెను; సర్వజనులును సంతోషములో మునిఁగియుండిరి:—ఇట్లుండఁగా కడపటిరాణియగు కైకకు చిరకాలముక్రిందట రాజిచ్చిన రెండు వరములసంగతి యొకదాసి జ్ఞప్తికిఁ దెచ్చెను. వెనుక నొక సమయమున ఆమె రాజును మిక్కిలి సంతోషపెట్టఁగా ఆమె కోరిన రెండుకోర్కెలు దీర్తునని ఆయన వాగ్దానము చేసెను. “ నేను నీకుఁ జేయఁగలిగిన పనులు రెండేవియైనను గోరుకొనుము. ఆవరములు నీకిచ్చెదను.” అని ఆయన చెప్పెనుగాని అప్పుడామె యేమియుఁ గోరలేదు. ఆమాటయే మఱచిపోయినదామె. కాని దుష్టచిత్తయగు ఆమెసేవకురాలు రామపట్టాభిషేకసమాచారమువలన నంకురించిన ఆమె యసూయ నాధారముచేసికొని ఆమెకొడుకే రాజుతరువాత రాజ్యమేలువాఁడైన నెంతబాగుగా నుండునని మెల్లమెల్లగా పుల్లలు పెట్టుచు దాసీబోధనమువలన చివరకు కైక యీర్ష్యోన్మాదగ్రస్తురాలయ్యెను. అంతట రాజును ఆరెండు వరములును ఇప్పుడివ్వుమని కోరుమని దాసి రాణికి సలహా చెప్పెను.—ఆమెకొ[illegible]

గైనభరతుని సింహాసన మెక్కించుట మొదటివరము, రాముని రాజ్యభ్రష్టుని చేసి యతనిచే పదునాలుగేండ్లు వనవాసము చేయించుట రెండవవరము.

ఇఁక రాముఁడు రాజుబహిఃప్రాణమే! కోరినది వరము దుష్టమైనవరము! రాజు ఆడినమాట ఎన్నఁడు దప్పఁగలఁడు! ఈ విషమస్థితిలో అతని కేమిచేయుటకుఁ దోఁచకుండెను. అంతట రాముఁడే అతని నాయిక్కట్టునుండి తప్పించెను:—తనతండ్రికి అసత్యదోష మంటకుండ తాను మనఃపూర్వకముగా రాజ్యము వదలి ప్రవాసము చేయుట కొప్పుకొనెను. తనప్రియురాలగు సీతతోను, భ్రాతృభక్తుఁడగు లక్ష్మణునితోను, పదునాలుగేండ్లు ప్రవాసము చేయుటకు రాముఁడు స్వదేశమును వదలి పోయెను; ఎంతచెప్పినను సీతాలక్ష్మణులు రాముని విడిచి యుండమనిరి.

ఈయడవులలో నుండువారెవరో ఆర్యులకుఁ దెలియదు. ఆరోజులలో ఆటవికజాతులను మర్కటము లనువారు; అసాధారణబలపరాక్రమములు గలిగినయెడల ఆ "కోఁతి"జాతి వారిలోఁ గొందఱను రాక్షసు లనువారు.

కాఁబట్టి అట్టికోఁతులును రాక్షసులును ఉండు అడవికే సీతారామలక్ష్మణులు వెళ్లినారు. కూడవచ్చెదనని సీత యడిగినప్పుడు, "సుకుమార రాజకుమారివైన నీవు కష్టముల కోర్చి అజ్ఞాతములైన అపాయములతో నిండియుండు అడవి

లోనికి నాతో నెట్లు రాఁగలవు?" అని రాముఁ డనెను.
"రాముఁడు వెళ్లినచోటికెల్ల సీతయును వెళ్లును; రాజపుత్రిక యనియు రాచకన్నె యనియు నాతో నెట్లు మాటాడఁగలిగి నారు? మీకుముందే నేఁబోదును" అని సీత ప్రత్యుత్తర మునఁగి వెంట వెళ్లెను. తమ్ముఁడైన లక్ష్మణుఁడుఁగూడ వారితో వెళ్లెను. అడవిలోనొచ్చి కడుదూర మేగి వారు గోదావరీ నది చేరిరి; నదీతీరమునఁ బర్ణశాలలు కట్టుకొని రామ లక్ష్మణులు లేఁతెచ్చిన పండ్లును వేఁటాడిన లేడిమాంసమును దిని బ్రతుకుచుండిరి. కొంతకాల మట్లు కడవఁగా నొకరోజున వికటవిగ్రహయగు నొకరాక్షసి వచ్చెను. అది లంకా(సింహళా)ధిపతియగు రాక్షసునిసోదరి. యథేష్టముగా వనవిహారము చేయుచున్న యామెకు రాముఁడు కంటఁబడెను. చూచువెంటనే అతిసుందరాంగుఁడగు అతనిపై ఆమెకు వలపుజనించెను. రాముఁడు విశుద్ధతముఁడును వివాహితుఁడును గాన ప్రతిప్రేమ చూపఁజాలఁడయ్యెను. పగసాధించుకొనుటకై ఆమె రాక్షసరాజగు తనసోదరునొద్దకుఁ జని రామభార్యయగు సీత సౌందర్యాతిశయమెల్ల సవిస్తరముగా నతనికి వర్ణించిచెప్పెను.

శ్రీరాముఁడు మానవజాతిలో మహాత్మమైన బలము గలవాఁడు. అతనిని నిర్జింపఁగల పిశాచములుగాని యితరులుగాని యెవ్వరును లేరు. కావున రాక్షసరాజు మాయనుపన్న వలసి వచ్చెను. మాయావియగు మఱియొక రాక్షసుని వశపఱచు

కొని అతనిని అతిసుందరమగు బంగారులేడిగా మార్చెను. అది తల్లి రాముఁడున్న చోటిచుట్టును గంతులిడుచుండెను; దాని యందమునుజూచి వ్యామోహమునంది సీత దానిఁబట్టు కొని తనకుఁ దెచ్చిపెట్టుమని రాముని బతిమాలెను. సీతా సంరక్షణార్థము తనతమ్మునుంచి రాముఁడు దానిని బట్టుకొనుట కడవిలోనికిఁ బోయెను. లక్ష్మణుఁడు మంత్రించి పర్ణశాల చుట్టును ఒక నిప్పులగీతగీసి సీతతో నిట్లనియెను:—“నేఁడు మీ కేదో కష్టము రానున్నట్లగపడుచున్నది, కావున మంత్రి పూర్వముగాఁ గావించిన యీవలయమును దాఁటి పైకివెళ్ల కుఁడు. వెళ్లినయెడల మీ కేదోయొక యపాయము తటస్థించు ను.” ఇట్లుండ నట, రాముఁడు మాయలేడి మేసుదూసికొని పోవునప్పుడొక బాణమును బ్రయోగించెను. వెంటనే లేడి మనుష్యుఁడుగా మారి మరణించెను.

అప్పుడే పర్ణశాలకడ “హా! లక్ష్మణా! వచ్చి నాకుఁ దోడ్పడుము!” అను ఆర్తధ్వని యొకటి రామకంఠముచుండి వచ్చినట్లు వినఁబడెను. “లక్ష్మణా! రామసాహాయ్యార్థము వెంటనే నీవు విపినములోనికిఁ బొమ్ము!” అని సీత పలికెను. “అమ్మా! అది శ్రీరాముని కంఠస్వరము గాదు.” అని లక్ష్మ ణుఁడు నొక్కిచెప్పెను. కాని ఆమాట వినక సీత ప్రార్థించి బలవంతపెట్టఁగా ఆమెనువదలి లక్ష్మణుఁడు రాముని వెదకుచుఁ బోవలసివచ్చెను. లక్ష్మణుఁడు వెళ్ళినతక్షణమే తత్పూర్వము

సన్న్యాసిరూపమును దాల్చియున్న రాక్షసరాజు వచ్చి ద్వారముకడ నిలఁబడి "భవతి! భిక్షాందేహి!" అని పలికెను. "అయ్యా! కొంచెముసేపుండుఁడు! నాభర్తగారు వచ్చులోడనే మీకుఁ గావలసినంతభిక్ష పెట్టెదను." అని సీత పల్కెను. "అంతవఱకు ఆఁగలేనమ్మా! ఆఁకలి మిక్కుటముగా నున్నది, నీకున్నదేదియో అది పెట్టుము" అని యతిఁడు మాఱు పల్కెను. ఆమాటలు విని సీత కుటీరములో నున్న కొన్ని పండ్లు పట్టుకొనివచ్చి యిండమనెను. పైకిరమ్మని భిక్షుకుఁడు బహుబోధనములు చేసెనుగాని యామె గీఱదాఁటి పైకి రాలేదు. "అమ్మా! నేను పూజ్యుఁడనగు సన్న్యాసిని, నీ వెంతమాత్రమును భయపడనక్కఱలేదు" అని చెప్పి నమ్మించి యొప్పించెను. ఎట్టకేలకు సీత, మంత్రించిన గీఱ దాఁటి యీవలికివచ్చెను; వెంటనే ఆకపటభిక్షుకుఁడు నిజరాక్షసరూపమును గైకొని సీతను బందిఁబట్టుకొని, తన మాయావిమానమున నారోహణము చేసి, యేడ్చుచున్న యామెను దానిపైఁ జేర్చుకొని పాఱిపోయెను. పాపము కేవలము నిరాధారయైన ఆసీతను రక్షించుటకెవరును లేరైరి. రాక్షసుఁడు తన్నెత్తుకొనిపోవుచుండఁగా ఆమె తనభూషణములు మున్నగు వానినుండి నగలు కొన్ని యూడఁదీసి దారిలో అక్కడక్కడ భూమిపైఁ బడవైచెను.

రావణుఁడామెను తనరాజ్యమైన లంకాద్వీపమునకుఁ

గొనిపోయి తనరాణిగమ్మని దురాశలుగొల్పి పలువిధములఁ
దప్పుత్రోవకుఁ ద్రిప్పఁ బ్రయత్నించెనుగాని పూర్ణపాతివ్రత్య
పుణ్యమూర్తియైన భూపుత్రిక ఆరాక్షసునితో మాటమైన
నాడకుండెను. వాఁడు వానికి శిక్షగా తనభార్యయగుట
కొప్పుకొనువఱకును అహోరాత్రము లామె యొకచెట్టు
క్రింద నివసించునట్లుచేసెను.

రామలక్ష్మణులు పర్ణశాలకుఁ దిరుగవచ్చిచూడఁగా
సీత కనఁబడక పోవుటచే అపారదుఃఖమునొందిరి. ఆమె యే
మైనదో యూహింపఁజాలకుండిరి. సోదరులిద్దఱును ప్రతిచోట
సీతను వెదకుచుఁ బోయిరిగాని యామెజాడయేమియు తగుల
లేదు. అట్లు వెదకుచు పోఁగాపోఁగా వారికి "కోఁతుల"గుం
పొకటి కనఁబడెను. తన్మధ్యమున హనుమంతుఁడను "దివ్య
వానరుఁ"డుండెను. మర్కటరాజగు హనుమంతుఁడు రాము
నకతివిశ్వాసపాత్రుఁడగు సేవకుఁడయి సీతావిమోచనమందు
తనికిఁ దోడ్పడెను; ఆసంగతి ముందుముందు మనకుఁ దెలియఁ
గలదు. అంత రామభక్తి యతనికుండుటచేతనే అతనినిప్పటి
కిని హిందువులు దేవుని సత్యసేవకునిగా, పరమ భగవద్భక్తా
గ్రేసరునిగాఁ, బూజింతురు. ఈ "కోఁతులు" "రాక్షసులు"
అనఁగా దక్షిణహిందూదేశపుటాదిమ నివాసులని [illegible]
గోచరింపవచ్చును.

చివరకు రాముఁడీ "కోఁతులను" గలసికొని

ఆకాశము మీఁద నొక విమానము పోవుచుండఁగాఁ దాము చూచితి మనియు, దానిలో నొక పరమసౌందర్యవతియగు స్త్రీని బెట్టుకొని యొక "రాక్షసుఁడు" పోవుచుండెననియు ఆమె యత్యంతము విలపించుచుండెననియు, తమ నెత్తిపై నుండి పోవుచున్న రథమునుండి, ఆమె యవస్థ తమకుఁ దెల్పుటకై, ఆమె యాభరణ మొకటి క్రిందఁ బడవేసెననియు, వారతనికిఁ జెప్పి యా యాభరణమును జూపిరి. *లక్ష్మణుఁడది పుచ్చుకొని యది యెవరిదో తనకుఁ దెలియదనెను. రాముఁడది యతని యొద్దనుండి పుచ్చుకొని గుఱుతుపట్టి "ఔ నిది సీతదే" యనెను.

హిందూదేశములో అన్నభార్య సతిభక్తితోఁ జూతురు. లక్ష్మణుఁడు సీతభుజములను కంఠమును ఎన్నఁడును జూచి లేఁడు. కనఁబఱిచినది కంఠాభరణము గావున అది యెవరిదో ఆనవాలు పట్ట యతఁడు చెప్పలేకపోయెను. ఈప్రాసంగిక వాక్యములలో ఆప్రాచీన హిందూదేశాచారము సూచించబ

---

* వా॥ రామాయణము — లక్ష్మణ వాక్యము

శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥—

దండకడియములు నెఱుఁగను చెవికమ్మల మాట నెఱుఁగను, కాలి నిత్యము పాదములకు నమస్కరించుచుండు వాఁడను గాన, అందెలు మాత్ర మెఱుఁగుదును.

బడినది. పిమ్మట ఆరాక్షసరాజునుగూర్చియు అతని వాసస్థానముఁ గూర్చియు రామునికిఁ జెప్పి వానరులందఱును వానిఁ గని పట్టుటకై పోయిరి.

వానరరాజైన వాలియును అతనితమ్ముఁడైన సుగ్రీవుఁడును అప్పుడు రాజ్యముకై కుమ్ములాడుకొనుచుండిరి. వాలి సుగ్రీవుని తఱిమివేసెను. రామునిసాహాయ్యముచే తమ్ముఁడు వాలినుండి తనరాజ్యము మరలఁ గైకొనెను. దానికి ప్రతిఫలముగా సుగ్రీవుఁడు రామునికి సాహాయ్యము చేసెదననెను. వానరులు దేశమంతయు గాలించిరిగాని సీతను గనుఁగొనలేకపోయిరి. చివరకు హనుమంతుఁడు ఒక్కఁడు దాఁటుచున హిందూదేశ సముద్రతీరమునుండి సింహళద్వీపమునకు దుమికి సీతకోసము లంకయంతయు వెదకుచుండెనుగాని యామెనెచ్చటను గాంచలేకుండెను.

ఆరాక్షసరాజు దేవతలను మానవస్త్రీపురుషులను యావత్ప్రపంచమును జయించి సుందరస్త్రీలనందఱను దెచ్చి తన యుపభార్యలుగాఁ జేసికొనెను. కావున "అంతిపురములో నామెయుండదు. ప్రాణత్యాగమైనఁ జేసికొనునుగాని ఆయిల్లా లట్టిచోట నుండదు." అని హనుమంతుఁ డనుకొని ఆమెనితరస్థలములందు వెదకుటకుఁ జనెను. తుదకు సీత నల్లనా చెట్టుక్రిందఁ జూచెను. ఆమె ఎక్కువ చాలిపోయి, అధైర్యమై

తిక్ష్మచక్రమునఁదోఁచు క్రొత్తచందమామవలెఁ గాన్పించెను. ఒకచిన్న పుష్పగిరి ఆచెట్టుమీఁదఁ గూర్చుండి—రావణునిచేఁ బంపఁబడిన రాక్షసస్త్రీలు వచ్చి సీతనొప్పించి రావణువశము చేయుటకై ఆమెను భయపెట్టఁ బ్రయత్నించుచుండుటయు, ఆమె యా రాక్షసరాజుపేరైన విననొల్లకుండుటయు—ఈయంతయు హనుమంతుఁడు స్వయముగాఁ జూచెను.

అంతట హనుమంతుఁ డామెకు దగ్గఱగావచ్చి, తాను రామదూత యెట్లయ్యెనో చెప్పి, ఆయనయే సీతాన్వేషణార్థము తన్నుఁ బంపెనని విన్నవించి, ఆనవాలుగా ఆయన యిచ్చిన ముద్రటుంగరమును జూపెను. ఆమె సమాచారము తెలియుతోడనే సేనతో వచ్చి రాక్షసరాజునోడించి ఆమెను చెఱవిడిపించి మరలఁగొనిపోవును, అని కూడ మనవిచేసెను. "కాని అమ్మా! తమకిష్టమగునెడల, తమ్ము నాభుజములపై నిడుకొని, యిప్పుడే ఒక్కగంతులో సముద్రముదాఁటి, తమతో రామునికడకేగెదను. తమ చిత్తము" అనిచెప్పెను. పాతివ్రత్యమే మూర్తీభవించి సీతగాఁ బుట్టినది, భర్తనే కాని పరపురుషుల శరీరము నామె యంటలేదు కావున, ఆతలఁపే ఆమె కసహ్యముగాఁ దోఁపట్టెను. అందుచే ఉన్నచోటనే సీత యుండవలసివచ్చెను. గుర్తుగా రామునకుఁ గొనిపోవుటకై ఆమె యొసఁగిన చూడామణిని బుచ్చుకొని హనుమంతుఁడు మరలి వచ్చెను.

సీతావృత్తాంతమెల్ల హనుమంతునివలనఁ దెలిసికొని, రాముఁడు సేనను ప్రోగుచేసికొని, దానితో హిందూదేశ దక్షిణభూమ్యగ్రమువైపు చనెను. అట, రాముని వానర బలము, హిందూదేశమును సింహళమును గలుపునొక మహా సేతుబంధనము గావించెను. నీరు మిక్కిలి తక్కువగా నున్నప్పుడు, సేతుసంబంధములైన ఆపులినములమీఁద నడచి హిందూదేశమునుండి, యిప్పుడుకూడ, సింహళమునకుఁ బోవచ్చును.

రాముఁడు భగవదవతారము, కానిచో అవన్నియు నట్లు చేయఁగలిగి యుండునా ? ఆయన దేవుని సప్తమావతారమని హిందువుల నమ్మకము.

వానరులు కొండలకు కొండలు పెల్లగించి సముద్రములోఁ బడవేసి, వానిని మ్రాలతోను, చెట్లతోను, గప్పఁగాఁ బెద్దసేతు వేర్పడినది. ఉడుతయొకటి యిసుకలో పొరలుచు కట్టుచోటికిపోయి యొడలువిదుల్చుకొని ఆయిసుక రాల్చుచు నటు ముందఱికి వెనుకకుఁ బరుగులిడుచు యథాశక్తిగా సేతుబంధన కార్యమందుఁ దోడ్పడుచుండెనఁట. పెద్దపెద్దకొండలు, మహారణ్యములు, ఉత్తుంగ సైకతములు, సమూలముగాఁ బెకల్చి తెచ్చుచున్న వానరవీరులు ఆయుడుత చేయు పనిఁ జూచి నవ్వినారఁట. రాముఁడది కనిపట్టి “ఈచిన్ని

యుండుటకు శుభమగుఁగాక! దాని శాంతశక్తియున్నదో ఆయంతశక్తియు వినియోగపఱచి యుపకారము చేయుచున్నది. కావున మీలోని మహోత్తమ బలశాలుల గొప్పతనమెంతయైనను దాని గొప్పతనము తక్కువగాదు" అని పల్కి అతి ప్రేమతో దాని వీఁపు తనచేతితో నిమిరెనఁట. ఉడుతల వీఁపుమీఁద నేఁటికిఁ గూడఁ గనుపట్టుచారలు మైపొడుగునను దువ్విన ఆ శ్రీరామచంద్రమూర్తి వాఁడి వ్రేళ్ల జాడలఁట!

సేతువుకట్టుట మైనపిదప వానరబలము నంతయు వడపూనుచు దానిమీఁదనుండి పోయి రామలక్ష్మణులు సింహళమునందుఁ బ్రవేశించిరి తరువాతఁ గొన్ని నెలలవఱకు ఘోర యుద్ధము జరిగెను. మిక్కిలి రక్తపాత మయ్యెను. చివరకు రాక్షసరాజు నిర్జితుఁడై హతుఁడయ్యెను; ధర్మస్థితములైన రాజభవనాదులతోఁ బాటు దాని రాజధానిపట్టణము పడెను. 'హిందూ దేశములో దూరముగా నున్నకొండలకుఁ బోయి నేను సింహళమునకుఁ బోయి వచ్చితినని చెప్పినప్పుడు అమాయకులు బహు అందఱిప్రజలు "మనపూర్వులు చెప్పినట్లు అచటియిండ్లు బంగారముతోఁ గట్టినవి కావా!" అనిరి. స్వర్ణవికారములైన ఆపట్టణములన్నియు రామునకు స్వాధీనమయ్యెను; కాని రావణుని తమ్ముఁడగు విభీషణుఁడు యుద్ధములో రామున కమూల్యమైన సాహాయ్యము చేసినందువలన దానికి ప్రతిఫలముగా

రాముఁ డవియన్నియు విభీషణున కిచ్చి అన్నగారికి బహులుగా అతనిని సింహాసనముపైఁ గూరుచుండఁ బెట్టెను.

అంతట సీతతోను, పరివారములోను రాముఁడు లంక నుండి వెడలిపోయెను. ప్రవాసకాలపు మొదటిదినములలో తమ్ముఁడైన భరతుఁడు రాముకడకు వచ్చి, వృద్ధప్రభువైన తండ్రిమరణమును దెల్పి, వచ్చి సింహాసన మధిష్ఠింపు మని పట్టుపట్టి, బతిమాలుకొనెను. కాని యతఁ డట్లు చేయనొల్లఁ డయ్యెను. రామవనవాసకాలములో భరతుఁడు సింహాసన మెక్కక అతిభక్తితో అన్నకు మాఱుగా ఆయనపాదుకలం దుమీఁదఁ బెట్టి పరిపాలన మొనర్చుచుండెను. ఇపుడు రాముఁడు రాజధానికి మరలవచ్చి సర్వజనసమ్మతముగా అయోధ్యకుఁ బ్రభువయ్యెను. కొన్నాళ్లపిదపఁ బ్రజలసంతృప్తులై గొణఁగుకొన మొదలుపెట్టిరి. "రావణునిగృహమందున్నప్పుడు సీత కేవలము నిష్కలంకగా నున్నట్లు నిదర్శన మేమియుఁ జూపలేముగదా!" అని యాడఁబొచ్చిరి. "ఏమీ సతీత్వశంక! ఆమె మూర్తీభవించిన పాతివ్రత్యమే కాదా?" అని రాముఁడు పలికెను. "ఏమైననుసరే, మాకు పరీక్ష కావలెను. దివ్యప్రమాణ మొకటి గావలయును" అని ప్రజలు నొక్కిచెప్పిరి. అంతట పెద్దయగ్గిగుండ మొకటి ఆయిత్తముచేసిపెట్టిరి. అందు సీత దుముకవలెను. రామునిబొందిలోఁ బ్రాణములు లేవు. తన కిఁక సీత దక్కదని తలఁచి మనసులో మహాపరితాపము

నొందుచుండెను. కాని సీత గుండములోఁ జొచ్చినతక్షణమే సింహాసనమొకటి తలపై పెట్టుకొని యందుండి యగ్నిదేవుఁడు వచ్చి కాన్పించెను. ఆసింహాసనముపై సీతాదేవి యుండెను. అంతట రాజ్యమందందఱును ఆనందనిమగ్నులైరి. ప్రతివాఁడును విచ్ఛిన్నసంశయుఁడై పరితుష్టచిత్తుఁడయ్యెను.

తనరాజ్యము మరలఁదనకు వచ్చినతరువాత పూర్వాచారప్రకారము, ప్రజాక్షేమముకొఱకు, రాముఁడు కొన్ని యావశ్యకమైన ప్రతిజ్ఞలు చేసెను. ప్రభువన్నమాటయే కాని, నిజముగా రాజు తన రాష్ట్రప్రజల దాసుఁడు. ప్రజాభిప్రాయముల శిరసావహించి నెఱవేర్పకతీఱదు—ఈ మాట యొక్క సత్యము ఇప్పుడే మనకు విదితము కాఁగలదు. రాముఁడు కొన్ని వత్సరములు సీతతో సుఖముగాఁ గడపెను. అంతట "ఒక రాక్షసుఁడు బలాత్కారముగాఁ బట్టుకొని సముద్రముయొక్క ఆవలిప్రక్కకుఁ గొనిపోయినదే ఈ సీత!" యని ప్రజలు మరల గొణుగుకొనసాగిరి. పూర్వపు దివ్యపరీక్షతో వారికి తృప్తిగాలేదు. "మఱియొకపరీక్షమైనను జేయవలెను. ఆమెను రాజ్యమునుండియైన వెడలఁ గొట్టవలెను" అని యఱవనారంభించిరి.

ప్రజల యభీష్టము ననుసరించి పాపము! రాముఁడామెను దేశమునుండి వెళ్ళఁగొట్టి అడవికిఁ బంపవలసివచ్చెను; కవియు ఋషియునైన వాల్మీకియాశ్రమ మాయడవి

లోనే యుండెను. దిక్కుమాలినదై విలపించుచున్న సీతను జూచి శోచనీయమైన ఆమె కథ విని, అతఁడామెకు తన యాశ్రమములో నెలవొసంగి కాపాడెను. ఆసన్నప్రసవమైన యామె కిద్దఱు మగపిల్లలు పుట్టిరి. వారెవ్వరో కవి కవల కెన్నఁడును జెప్పకుండనే యిద్దఱను బ్రహ్మచర్యాశ్రమమునఁ బెట్టి పెంచుచుండెను. వాల్మీకి అప్పుడు రామాయణకావ్యము రచించి, పాడుటకు వీలుగా దాని నొక నాటకముగను జేసెను.

ప్రాచీనహిందువుల దృష్టిని నాటకము మహాపవిత్రమైన గ్రంథము. నాటకము, సంగీతము:—ఇవి రెండును కేవల మతముగానే పరిగణించెడువారు. మనస్సంతయు అందు లగ్నము చేసిన నో గీతము—పేరుగీతమైనను సరే, తదితరమైనను సరే,—మనుష్యుని ముక్తుని జేయును, మతేమియును అతఁడు చేయనక్కఱలేదు. ధ్యానగమ్యస్థానమును దాని గమ్యస్థానమును ఒక్కటేయని వారు చెప్పుదురు.

కావున వాల్మీకి శ్రీరామచరిత్రమును నాటకరూపముగాఁ జేసి, యది యెట్లు చదివి గానము సేయవలెనో ఆబిడ్డలకు నేర్పెను.

అంతట రాముఁడొక మహాయజ్ఞము చేయనున్న తఱి వచ్చెను. అట్టియాగములు పూర్వరాజులు చేయు ఆచారము గలదు. కాని హిందూదేశములో యజ్ఞాదికర్మములేవియు

భార్య లేకుండఁ జేయఁగూడదు; అట్టివానితో సహధర్మిణి యగు భార్య భర్తతోఁగూడ నుండవలెను. హైందవగృహస్థు చేయవలయు కర్మములనేకములున్నవి, కాని ఆమె చేయవలయు పనులు చేయుచుఁ దనభార్య కూడనున్నఁ గాని యం దొకటియు నతఁడు శాస్త్రీయముగా జరిగించుట సాధ్యము గాదు.

రాజ్యమునుండి వెళ్లఁగొట్టఁ బడుటచే శ్రీరాముని భార్య అప్పుడాయనయొద్ద లేదు. కనుకఁ బ్రజలాయనను మరలఁ బెండ్లియాడుమనిరి. కాని యావిషయమున రాముఁడు ప్రజలకు వ్యతిరిక్తుఁడై నిలఁబడెను. తన జీవితములోఁ బ్రజాభీష్టమునకుఁ బ్రతికూలుఁడై రాముఁడు ప్రవర్తించుట కిదియే తొలిసారి. "మీరు చెప్పినట్లు చేయుటకు వీలులేదు. నా ప్రాణము సీతది" అని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అందుచేత, యాగాచరణార్థము, సీతకుమారుగా, బంగారముతో ఆమెప్రతిమ యొకటి చేసిరి. మతప్రవృత్తి నెక్కువ చేయుటకై ఆక్రతుమహోత్సవములో నాటక మొకటి యాడు ఏర్పాటు కూడఁ గావించిరి. మహామునియు మహాకవియు నైన వాల్మీకి, తనశిష్యులును రామునియొక్క అజ్ఞాత పుత్రులును అగు కుశలవులతో, క్రతువునకు వచ్చెను. ఎత్తుగా నొకరంగస్థలము నిర్మించినారు. నాటక ప్రదర్శనమునకు సర్వము ఆయత్తమై యుండెను. తన తమ్ములతోను, కులీన బృందముతో

తోను, ప్రజావర్గముతోను, రాముఁడు వచ్చి పెద్ద ప్రేక్షక సభలోఁ గూరుచుండెను. వాల్మీకి ప్రేరణమునఁ గుశలవులు రామచరితమును గానముచేసిరి; మధురమైన వారికంఠస్వరములును మనోహరమైన వారి యాకారములును యావత్పరిషత్తును వ్యామోహపఱిచెను. నాటకములో సీతా ప్రవాస ప్రదర్శనభాగము రాఁగానే పాపము! రామునకు దుఃఖముచే పిచ్చి యెత్తినట్లయ్యెను, ఏమిచేయుటకును అతనికిఁ దోఁచుట లేదు! "రామా! దుఃఖపడకుము, నీకు సీతను జూపెదను" అని ముని పలికెను. పలికి సీతను నాటకరంగముపైకిఁ దెచ్చెను. తెచ్చినతక్షణమే రాముఁడు ముందఱికిఁ బరుగిడిపోయి యామెను కౌఁగిలించుకొనెను. వెంటనే "పరీక్ష! పరీక్ష!" అను ప్రాంత యఱపులతోఁ గూడిన యొక కలకలధ్వని వినఁబడెను. పాప! మాసీతామహాదేవికి తన యకలంకత్వమును గూర్చి మరలఁ జేయఁబడిన యీ ఘోరాపనింద భరించుట కలవిగాక పోవుటచే "ఓ! దేవతలారా? నానిర్దోషత్వమునకు నిదర్శన మగపఱుపరా"! అని యామె మొఱపెట్టెను. అంతట భూమి వివృతయయ్యెను. వెంటనే "ఇదిగో! ప్రమాణ" మని చెప్పుచు సీతభూగర్భముఁజొచ్చి యదృశ్యమయ్యెను. ప్రజలాదురంతమును గాంచి భయ విస్మయభ్రాంతులైరి. రాముఁడు దుఃఖసముద్రములో మునిఁగిపోయెను.

సీత మాయమైన కొన్నాళ్ల పిదప, దేవతలనుండి

యొకదూత రామునొద్దకు వచ్చి "స్వామీ! ఎందుకై తమరు భూమికి వచ్చితిరో ఆపని యంతయును అయినది, ఇంకఁ దమరు మరల వైకుంఠమునకు దయచేయవలసి యున్నది" అని విన్నవించెను. దానివలన రామునకు యథార్థ స్వస్వరూపజ్ఞానము కలుగఁగా, తనరాజధానినంటి ప్రవహించు చున్న మహాసరయూనదిలోఁ బడి మునిఁగి పరలోకమున సీతను కలిసికొనెను.

ఇది హిందూదేశ ప్రాచీన వీరచరిత్రములలో మహోత్తమమైనదాని సంక్షిప్తకథ. సీతారాములు హైందవజాతికి పరమాదర్శమూర్తులు. బిడ్డలందఱు—ముఖ్యముగా బాలికలు—సీతను బూజింతురు. సనుసకష్టములఁ బడినయీవిశుద్ధమూర్తి, యీపరమ పతివ్రతాశిరోమణి, యీసీతాదేవి—మెల్లండెనో యెల్లంకుటయే స్త్రీ వారి ఛాపరమావధి. ఈగ్రంథ నాయకుల చరిత్ర మీరుచదివినయెడల, హిందూపరమార్థ లక్ష్యమునకును పాశ్చాత్యపరమార్థ లక్ష్యమునకును ఎంతభేదమున్నదో మీకుఁ దెలియఁగలదు. సర్వహిందూజాతిశ్రేష్ఠిని, సీత; దుఃఖానుభూతికి పరమ లక్ష్యముగానున్నది. "చేయుము, క్రియారూపమున శక్తి ప్రకటనము గావించుకొనుము" అని పాశ్చాత్యదేశము పల్కెను. "కష్టసహనము వలన నీశక్తిఁ గనఁబఱుపుము" అని హిందూదేశము చెప్పెను. "మనుష్యుఁ డెంత యార్జించుకొనఁగలఁడు?" అను

విషయమును పాశ్చాత్యభూమి నిస్సందేహముగా సాధించి పరిష్కరించినది. "ఎంత యల్పార్థముతో మనుష్యుడు బ్రతుకగలడు?" అను ప్రశ్నకు సరియైన జవాబుచెప్పి హిందూమాత ప్రత్యక్ష నిదర్శన మగపఱిచినది.

ఈ పరస్పర విరుద్ధములైన పరమావధులు రెంటను మీరు చూచుచున్నారు. సీత హిందూదేశమునకు ఆదర్శభూతురాలు, భావనారూపమైన హిందూదేశ మేఆమె. అట్టిసీతయను నొకయామె నిజముగా ఎప్పుడైన నుండెనా లేదా, అది సత్యమైనకథ లేకానాకాదా—అనునది యిటవిమర్శింపవలసిన విషయము కాదు; పరమలక్ష్యముగా నొక యాదర్శమట నున్నదని మనకుఁ దెలియును, అదిచాలును. లక్ష్యరూపముగానుండు ఈసీతాదేవి హిందూజాతియాందంతటను వ్యాపించి, దానిజీవస్థానములోఁ జొచ్చి, దానిపవిత్రరక్తబిందువునందును నటనముచేయుచున్నది, ఇట్టి పౌరాణికథానాయికలోరు లెవ్వరును లేరు. హిందూదేశములో, మంచివానికన్నిటికిని, విమలమునై పవిత్రములైనయన్నిటికిని, స్త్రీలలోనుండు స్త్రీజనోచితములైన సర్వసద్గుణములకును, సీతయనిపేరు. పురోహితబ్రాహ్మణుఁడు స్త్రీలలో పెద్దయామెనుగాని శిశువునుగాని యాశీర్వదింపవలసివచ్చినప్పుడు "సీతవగుమ్ము!" అనిదీవించును. వారందఱు సీతబిడ్డలు—సహాపరమవిశుద్ధయుఁ బరమపతివ్రతయుఁగానుండి, సమస్తకష్టములుపడి, క్షమాస్వరూపిణిగానున్న—ఆ

సీతామహాదేవి వంటివారగుటకు సకలశ్రమలుపడి ప్రయత్నించుచున్నారు. అన్ని కష్టము లనుభవించుచున్నను, అంతదుఃఖముపాలైనను, ఆ యిల్లాలు రాముని దూషించుచు నోట నొక పరుషవాక్యమైనను బలుకలేదు. అది తనవిహితధర్మమని, తాం జేయవలసినదంతయు ఆమె చేసికొనెను. ఆమెను అడవికి వెడలంగొట్టుట యెంతఘోరమైన అన్యాయమో ఆలోచింపుండు! అంత చేసినను, సీతమనసులో, నిసుమంతక్రోధమును పుట్టలేదు. ఇదికూడ హిందువుల పరమ లక్ష్యమే! ప్రాచీనుండైన బుద్ధుం డిట్లు చెప్పుచున్నాండు:—"ఒకండు నిన్ను బాధించినప్పుడు, అతనిని నీవు మరల బాధింతువేని దానివలన మొదటిబాధపోదు; కాని లోకములో నింకొకదుష్టకర్మముత్పన్నమగును." స్వభావముచే సీతసత్యమైన హైందవ సతీమణి, ఆమె, హింసకు ప్రతిహింస యెన్నండును జేయలేదు.

ప్రత్యక్షానుభవసిద్ధములైన పాశ్చాత్యుల బలపరాక్రమములు, దుఃఖానుభవములోం గనంబడుచు ప్రాచ్యుల మనోబలధైర్యములు—ఈరెండు ఆదర్శములలో సత్యతరమైనది యేదో యెవరెఱుంగుదురు?

"జయించి చెడుగును తగ్గింతుము" అని పశ్చిమదేశస్థులందురు. "ఓరిమితో కష్టమనుభవించి కష్టమును రూపుమాపెదము, అట్లు చేసినచోం జివరకు కష్టానుభవమే కేవల సుఖానుభవముగా పరిణమించును" అని ప్రాగ్దేశీయు లందు

రు. మంచిదే; రెండును గొప్ప యాదర్శములే. తుద కేది పోయి యేది నిలుచునో యెవనికిఁ దెలియును ? అం దేమనః ప్రవృత్తి నిజముగా మానవజాతికి ఎక్కువ యుపకారము చేయు నో యెవఁ డెఱుఁగును ? కష్టసహన కర్మకరణముల రెంటిలో నేది పశుత్వమును నిర్జించి యుపశాంతము చేయునో యెవఁడు చెప్పఁగలఁడు ?

అంతవఱకు, అన్యోన్యాదర్శ వినాశన ప్రయత్నములు మాత్రము మనము మానుకొందము. కష్టనిర్మూలనమే మన యుభయులకుఁ గావలయు పర్యవసానఫలము. అందుకై యే యుభయులము అభినివేశముతోఁ బనిచేయుచున్నాము. మీరు మీమార్గము నవలంబించుచు మమ్ము మాత్రోవను బట్టి పో నిండు. ఆదర్శములమాత్ర మంతరింపఁజేయకుండ నుందము. "మామార్గ మవలంబింపుఁడు" అని నేనెన్నఁడును పాశ్చాత్యులకుఁ జెప్పను. గమ్యస్థాన మేకమైనను త్రోవ లొక్కటిగా నెన్నఁటికిని నుండఁజాలవు. హిందూదేశస్థుల యాదర్శములఁ గూర్చి వింటిరి గావున "గంతవ్యస్థానము మంచిదే, అది యుభయులకు సమ్మతమే, యని మేమెఱుఁగుదుము. మీ లక్ష్యమును బట్టి మీరు వెళ్ళుఁడు. మీయిష్టానుసారముగా మీమార్గమును మీ రవలంబింపుఁడు. శుభమస్తు !" అని మీరుకూడ హిందూదేశస్థులతోఁ జెప్పుదురని నేను దలఁచెదను. లక్ష్యభేదములున్నవను కారణమున గ్రుద్దులాడుకొనకుఁ

డని ప్రాచ్యపాశ్చాత్యులతోఁ జెప్పి, యెంత పరస్పరవిరుద్ధములుగాఁ బైకిఁ గాన్పించుచున్నను, ఆరెంటిగమ్యస్థానములును ఒక్కటే యని చూపుట, యీజీవితములో నానియుక్తధర్మమై యున్నది. కావున నైహికజీవితము అద్రిద్రోణియందు చిక్కుత్రోవలలోఁబడి నిర్గమనమార్గము గానక పోవుమనము "మీకు శుభమగుఁగాక! మీకు శుభమగుఁగాక!" యని యన్యోన్యాశీస్సులను గావించుకొందము.

---

శ్రీరామచంద్రాయ!

II

(కాలిఫర్నియాలోని పేసడీనాయందలి షేక్స్పియ

ర్సంఘకార్యస్థానమున 1–2–1900 వ॥

తేదీని ఇచ్చిన యుపన్యాసము.)

# మహాభారతము

నేఁటిసాయంకాలము మీతో నే మాటాడఁబోవు రెం
డవ వీరచరిత్రమును మహాభారతమందురు. శకుంతలాదుష్యం
తులకుఁ గలిగిన భరతభూపతిసంతతివారిచారిత్ర మందున్నది.
మహా అనఁగా గొప్పది; భారతులు అనఁగా భరతవంశజులు.
వీరినుండియే హిందూదేశమునకు భారతభూమియనుపేరువచ్చి
నది. మహాభారతమునకు గొప్ప హిందూదేశమని కాని భర
తునియొక్క గొప్పసంతతివారి కథ యని కాని యర్థము చెప్ప
వచ్చును. ఈయితిహాసమందలి కథజరిగిన స్థలము ప్రాచీన
కురురాజ్యము. కురుపాంచాలురకు జరిగినయుద్ధము ఈకథ
కాధారము. కనుక యుద్ధముజరిగినప్రదేశమంత పెద్దదికాదు.
ఇదిహిందూదేశములో మిక్కిలి ప్రసిద్ధికెక్కినట్టియు జనప్రియ

నైనట్రోయి పురాణము. హోమరు వ్రాసిన కావ్యములకు గ్రీకులలో నెట్టిప్రామాణ్య ప్రభావములుండెనో, దీనికి హిందూదేశములో అట్టి ప్రామాణ్యప్రాముఖ్యములు గలవు. తానురాను క్రొత్తక్రొత్త విషయము లందుఁ జేర్చినారుగావున ఇప్పుడది రమారమి లక్షశ్లోకముల పెద్దగ్రంథమైనది. వివిధములైన గాథలు, కల్పితకథలు, పురావృత్తములు, తత్త్వశాస్త్రప్రసంగములు, సత్యచారిత్ర శకలములు, నానావిషయక వాద ప్రతివాదములు, అప్పుడప్పు డందులోఁ జొన్పినారు. అందుచే చివరకది పాండిత్యమయమైన యొక పెద్ద పుస్తకాల కట్ట యైనది, ఆయనిట్టిలోను సరములో సూత్రమువలె ప్రాచీనమూలకథ వ్యాపించియున్నది.

మహాభారతమందలి కథలోని ప్రధానభాగము, హిందూరాజ్యముకోసము జ్ఞాతులగు కౌరవులును పాండవులును గావించుకొనినయుద్ధము.

ఆర్యులు చిన్నచిన్న తండాలుగా హిందూదేశములోఁ ప్రవేశించినారు. క్రమముగా ఈయార్యజాతివారు వ్యాపించి తుదకు హిందూదేశమునకు అప్రతిహతాధికారు లైనారు. అంతట, ఆధిపత్యముకై, ఏకకుటుంబశాఖలేయైన యీకౌరవ పాండవులకు అన్యోన్య కలహము సంభవించెను. మీలో గీతాగ్రంథము పఠించినవారికి, అందాదిని యుద్ధసన్నద్ధము

లైన యుభయ సేనలతో నున్న రణరంగ మెట్లువర్ణింపఁబడినదో తెలిసిన విషయమేకదా! అదియే మహాభారత యుద్ధము.

చక్రవర్తిపుత్రులైన యిద్ద అన్నదమ్ము లుండిరి. అన్న పేరు ధృతరాష్ట్రుఁడు, తమ్ముని పేరు పాండువు. పెద్దవాఁడైన ధృతరాష్ట్రుఁడు జాత్యంధుఁడు. హిందూధర్మశాస్త్ర ప్రకారము గ్రుడ్డి, కుంటి, మొదలగు వికలాంగులకును శరీమందు జీర్ణించిన క్షయాదిరోగములు గలవారికిని పైతృకమగు ఆస్తి రాదు, అట్టివారికి భరణము మాత్రమే యిత్తురు. అందుచేఁ బెద్దవాఁడైనప్పటికిని ధృతరాష్ట్రుఁడు సింహాసనమెక్కఁజాలక పోయెను. పాండురాజు చక్రవర్తియయ్యెను.

ధృతరాష్ట్రునకు నూఱుగురు కొడుకులుపుట్టిరి. పాండురాజున కైదుగురుకొడుకులు మాత్రమేకలిగిరి. పాండురాజట్టే కాలము బ్రతుకలేదు, తదనంతరము ధృతరాష్ట్రుఁడు కురురాజయి తనబిడ్డలతో పాటు పాండుపుత్రులనుగూడఁ బెంచుచుండెను; వయసువచ్చినతరువాత వారిని విప్రవీరుఁడగు ద్రోణుని కప్పగించి ఆయనచేవారికి అస్త్రవిద్యాదివివిధ యుద్ధ కళలును రాజోచితములగు నితరవిద్యలును చక్కఁగా నేర్పించెను. విద్యాపరిసమాప్తియైనపిదప, పాండురాజుపెద్ద కొడుకగు యుధిష్ఠిరుని అతనితండ్రి సింహాసనమెక్కించెను. యుధిష్ఠిరుని ప్రశస్తసుగుణసంపత్తియును, అతనితమ్ముల యొక్క శౌర్యసౌభ్రాత్రములును గ్రుడ్డిరాజుకొడుకుల హృద

యాములలో అసూయఁ గలిగించెను. వారిలోఁ బెద్దవాఁడగు దుర్యోధనుని దుష్ప్రేరణముచేత, అచటజరుగుచున్న యొక దేవతోత్సవముఁ జూచుమిషమీఁద, పాండవసోదరులైదుగురను, ఒప్పించి వారణావతమునకుఁబంపిరి. దుర్యోధనుని ఉత్తరువులమీఁద అంటించినబగ్గుమను జనపనార, లక్క, మున్నగు వస్తువులతో నిర్మించిన యొక మేడలో వారినివిడియఁజేసి, తరువాత దానికి రహస్యముగా నిప్పంటించిరి. కాని ధృతరాష్ట్రుని సవతితమ్ముఁడును యోగ్యుఁడును అగువిదురుఁడు, దుర్యోధనాదుల దురుద్దేశములు ముందుగానే యెఱిఁగియుండుటచే, యుక్తకాలములో ఆద్రోహమంతయుఁ బాండవులకుఁదెల్పి జాగ్రత్తయని చెప్పెను; అందుచే ఎవరికిని దెలియకుండ పాండవులాయాపదనుండి తప్పించుకొని పోయిరి. లక్కమేడమండి మసియైనతోడనే కౌరవులు "అమ్మయ్య! బ్రతికినాము, ఇకమాయకష్టంకులన్నియుఁ దొలఁగిపోయినవి." అని సంతోషించిరి. రాజ్యము ధృతరాష్ట్రపుత్రుల యధీనమయ్యెను. తల్లియగు కుంతితోఁ బాండుపుత్రులైదుగురును ఒక యడవికిఁ బాఱిపోయిరి. ప్రచ్ఛన్నులై బ్రాహ్మణవిద్యార్థులమని చెప్పుకొనుచు చుట్టుపట్లకేగి పాండవులట భిక్షాజీవనము చేయుచుండిరి. అడవిలోవారికనేక కష్టములు సంభవించెను. కాని స్వబల పరాక్రమములచేతను ధైర్యసాహసముల చేతను వారాయిక్కట్లన్నియుఁ గడచిరి. అట్లుండఁగా నుండఁ

గా, దగ్గఱనున్న యొకదేశపురాజుకొమార్త వివాహము జరు
గఁబోవుచున్నదని వారొకనాఁడువినిరి.

ఈవిచిత్రప్రాచీన హైందవ వివాహపద్ధతిని గూర్చి
నిన్నరాత్రి మీతోముచ్చటించితిని. దానిని స్వయంవరమన
దు వారు; స్వయంవరమనఁగా—రాచకన్నె స్వయముగాఁ దన
పతిని గోరుకొనుట. అనేకరాజులును రాజవంశమువారును
అటసమావేశమగుదురు, వారిలో నొకనిని, రాజకుమారి తన
భర్తగా నెన్నుకొనును. ఆయారాజుల గుణములుద్ఘోషించి ప్రక
టించు భృత్యులను పురస్కరించుకొని, తనచేతిలో నొకపూల
దండఁబట్టుకొని నృపపుత్రి యటకువచ్చును. వరబృందములోఁ
బ్రతివాని పీఠముకడను, ఘోషకు లతనిగొప్పతనమును అతఁ
డుచేసిన మహాశూరకృత్యములును అభివర్ణించి ప్రకటింతురు.
తానెవనిని దనపతిగాఁ జేసికొనవలెననియున్నదో రాచకన్నె
నిశ్చయించుకొని యంతట నతనిమెడలోఁ బుష్పమాల వైచి
యామెతనిశ్చయమును వెల్లడిపఱుచును; వెంటనేయది వివా
హముగాఁ బరిణమించును. పాంచాలపతియగు ద్రుపదుఁడొక
మహారాజు, ఆయనకొమార్తయగు ద్రౌపది జగత్ప్రఖ్యాత
మగు చక్కఁదనముగలది, మంచివిచక్షణురాలు. ఇప్పుడామె
శూరుఁడగు నొకవరు నెన్నుకొనఁదలఁచి యున్నది.

స్వయంవర సమయమందెప్పుడును ఏదోయొక యస్త్ర
విద్యానైపుణ్య మగపఱుచు అద్భుతవీరకృత్యము జరుగుచుం

డును. ఈస్వయంవరములో నొకపరీక్షఁ బెట్టిరి:—పైని ఎత్తుగా నొక మత్స్యాకారలక్ష్యమును వ్రేలాడఁగట్టినారు, దానిక్రింద మధ్యరంధ్రముగలయొక చక్రముగట్టినారు, అది నిశ్చలముగా నుండక యెప్పుడును దిరుగుచుండునట్లు చేసినారు; క్రింద నేల మీఁద నొకనీళ్లతొట్టి యుంచినారు. నీళ్లతొట్టిలో ప్రతిఫలించిన చేఁపప్రతిబింబము చూచి, చక్రమధ్యమునుండి బాణము నంపి, దానితో ఆచేఁపకన్ను గొట్టవలెను. అట్లుకొట్టినవానికి ఆరాచకన్నను బెండ్లిసేయుదురు:—ఇట్లేర్పాటుచేసినారు. రాజపుత్రికను గామించి, హిందూదేశమందలి వివిధభాగములనుండి అనేకరాజులును రాజపుత్రులును వచ్చి, యొకరితరువాతనొకరామత్స్యయంత్రమును గొట్టి నిజనైపుణిఁజూపఁ బ్రయత్నించిరిగాని, యొకఁడును ఆలక్ష్యమును గొట్టఁజాలకపోయెను.

హిందూదేశములో నాలుగువర్ణములున్నవని మీ రెఱిఁగియేయుందురు; అందుఁ గులక్రమాగతమైన పౌరోహిత్యవృత్తిగల బ్రాహ్మణవర్ణ ముత్తమము, తరువాతిది క్షత్రియవర్ణము, రాజులును యోధులును ఇందలివారు; తరువాతిది వాణిజ్యవ్యాపారములు సేయువృత్తిగల వైశ్యవర్ణము; కడపటిది సేవకవర్ణమైన శూద్రవర్ణము. ఈరాజపుత్రిక ద్వితీయవర్ణపు క్షత్రియకన్యయని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

వచ్చినరాజబృందములో నెవఁడును గుఱిఁగొట్టఁజాలనందున, ద్రుపదరాజుకొడుకు సభామధ్యమునుండి లేచి నిలఁ

బడి యిట్లు పలికెను:—" క్షత్రియజాతివారైన రాజుల కీపని చేతఁగాకపోయినది గనుక; యితరవర్ణజులు ప్రయత్నింపవచ్చును; బ్రాహ్మణుఁడైననుసరే, శూద్రుఁడైననుసరే, మత్స్యయంత్రము కొట్టినవాఁడు మా ద్రౌపదికి భర్తయగును ! "

పంచపాండవులును బ్రాహ్మణులలోఁ గలిసి కూర్చుండిరి. అందు మూఁడవవాఁడైన అర్జునుఁడు ధనుర్విద్యలో మహాకుశలుఁడు. అతఁడు లేచి ముందటికేగెను. సాధారణముగా బ్రాహ్మణులు పరమశాంతులు:—పిరికివారని చెప్పవచ్చును. ధర్మశాస్త్రప్రకారము, వారు యుద్ధసాధనము ముట్టఁగూడదు, కత్తిఁ బట్టఁగూడదు, అపాయకరమైన యేసాహస కృత్యములోను బ్రవేశింపఁగూడదు. అధ్యయనధ్యానాంతరింద్రియనిగ్రహములకే వారిజీవితము సదా వినియోగపడవలెను. అట్టివా రెంతకలహవిముఖులుగాను ఎంత శాంతప్రియులుగాను ఉందురో మీరే యోజించుకొనుఁడు. అతఁడు లేచుట చూచి, తన్మూలఁడిఁక క్షత్రియుల యాగ్రహముపాలు సేయునని యుఁ దమయందఱకుఁ దప్పక చావు మూఁడినదని యు బ్రాహ్మణులనుకొనిరి. అనుకొని యతనిని బోవలదనిరి, కాని, శూరుఁడుగనుక అర్జునుఁడు వారిమాట వినలేదు. చేతితో విల్లెత్తి, అనాయాసముగా దాని నెక్కుపెట్టి, బాణము సంధించి, లాగి, చక్రిమధ్యమునుండి పోవునట్లు దానిని విడిచి యతఁ డాచేఁపకన్ను గొట్టెను.

అంతట, నంతటను, జయజయధ్వానములు బయలుదే
రెను. రాజపుత్రియగు ద్రౌపది యర్జుననొద్దకు వచ్చి మెడ
లో పూలదండవైచెను. కాని, రాజులును రాజకుమారులును
అంతమంది మహాసభలోఁ గూడియుండఁగా, క్షత్రియకన్య
యును సర్వాంగ సుందరియునగు ద్రౌపది నొక పేదబ్రాహ్మ
ణుఁడు జయించుకొనిపోవుట, రాజవర్గము చూచి సహింప
లేకపోవుటచే, నందుండి యొక మహాకలకలధ్వని బయలువెడ
లెను. వచ్చిన రాజు లర్జునుతోఁ బోరాడి బలవంతముగా
ద్రౌపది నతనినుండి లాగికొని పోఁదలఁచిరి. పాండవ సోదరు
లకును వైరివర్గమునకును ప్రబలయుద్ధము జరిగెను, కాని,
పాండవులు శత్రువులకు లొంగక మేరుధీరులై నిలఁబడి పోరి
వారినంతట జయించి అత్యుత్సాహముతోఁ బెండ్లికూఁతును
దీసికొనిపోయిరి.

రాచకన్నెతో అన్నదమ్ములైదుగురును ఇంటికి కుంతి
కడకు వచ్చిరి. భిక్షాటనముచేసి విప్రులు జీవింపవలయును.
కనుక బ్రాహ్మణవేషములతోనున్న వారుకూడఁ బైకివెళ్లి
బిచ్చమెత్తఁగా దొరకినది యింటికిఁ దేఁగా, అది తల్లి పంచి
వారికిఁ బెట్టుచుండెను. ఇప్పుడు నృపకన్యతో సోదరులైదు
గురును తల్లియుండు కుటీరములోనికి వచ్చి “అమ్మా! నేఁ
డొక మహావిచిత్రమైన భిక్ష సంపాదించుకొని యింటికిఁ దెచ్చి
నాము!” అని పరిహాసముగాఁ బలికిరి. లోపలఁ బనిచేసికొను

చున్న తల్లి యీమాటలు విని "బిడ్డలారా! మీరందఱు అది పంచుకొని యనుభవింపుఁడు." అని ప్రత్యుత్తరమిచ్చి, వచ్చి చూడఁగా రాజపుత్రి గాన్పించెను. "అయ్యో! ఏమంటిని! ఈమె కన్యయే!" అని యాశ్చర్యపడెను. చేయునదేమున్నది? తల్లినోటనుండి యొకసారి జాఱివచ్చినమాట జరిగితీరవలసినదే! అది యవిలంఘనీయముగదా! మాతృవాక్య పరిపాలనము చేయవలెను. ఆమెచే నసత్యమాడింపరాదు, తత్పూర్వ మట్లె న్నఁడును జరుగలేదు—కావున ద్రౌపది, సోదరు లైదుగురకును ఏకపత్ని యయ్యెను.

ప్రతిదేశ ప్రజాసంఘాభివృద్ధిలోను న్యూనాధికావస్థా క్రమముండునని మీకుఁ దెలియునుగదా. ఈ యితిహాస ములో నిగూఢముగా నుండి పూర్వకాలము లందలి యొకవి చిత్రమైన యాచారము గోచరించుచున్నది. గ్రంథకర్త, యైదుగురన్నదమ్ములను ఒక స్త్రీనే పెండ్లియాడిరని చెప్పి, దాని కొక కారణముఁ గల్పించి సమర్థింపఁ జూచినాఁడు—అది తల్లియాజ్ఞయఁట, ఆమె యనుమోదించుటవలన నట్టి విచిత్ర వివాహము జరిగినదఁట. ప్రతిజాతిలోను, సోదరు లొక్క భార్యను బరిణయమైనకాలము—బహుపతిత్వ మొప్పుకొనిన యవస్థ—గలదు. ఈసంగతి మీ రెఱుఁగుదురు. ఈద్రౌపదీ వివాహము ఆపూర్వకాలపు బహుభర్తృపరిణయదశనే నిస్సం దేహముగా సూచించుచున్నది.

ఈనడుమను, రాజపుత్రి సోదరుఁడు కలఁకువనొందిన మనస్సుతో "ఈమనుష్యు లెవ్వారు? నాచెల్లెలు పెండ్లాడఁబోవు వీఁడెవఁడు? రథతురగాదులేమియు వీరికిలేవు! పాదచారులై పోవుచున్నారుగదా!" అని యేమిచేయుటకును పాలుపోక, దూరదూరముగా నుండి వారివెంటఁజని, రాత్రి పొంచియుండి వారిసంభాషణ మంతయువిని, వారు నిజముగా క్షత్రియులేయని పూర్తిగా నిశ్చయించుకొనెను. తరువాత యథార్థముగా వారెవరో యెఱుకపడుటచే ద్రుపదరాజు పరమానందభరితుఁడయ్యెను.

మొదట, అది నిషిద్ధమని చెప్పుచు, అనేకాక్షేపణములు బయలు దేసినవిగాని, వ్యాసుఁడట్టి వివాహమా రాజపుత్రిల కర్హమేయని చెప్పుటచే, అందఱందుల కంగీకరించిరి. కావున ఈబహుభర్తృపరిణయమునకు ద్రుపదుఁడొప్పుకొనవలసివచ్చెను:—రాజకన్య యంతట పాండుపుత్రు లేవురను బెండ్లియాడెను.

పాండవులు, పిదప, నిరపాయులై, సుఖులై, దినదినప్రవర్ధమానబలపరాక్రమశాలులై జీవించుచుండిరి. దుర్యోధనుఁడును అతని పక్షమువారును వారినిజంపుటకు క్రొత్తమార్గము లాలోచించుచుండినను, ధృతరాష్ట్రునకుఁ బెద్దలు సద్బోధనములుచేసి పాండవులతో సఖ్యము చేసికొనఁ బ్రేరేపించిరి; కనుక నతఁడు వారినిఁ బిలిపించి అర్ధరాజ్యమిచ్చెను.

లంపులకందఱు ప్రజలును అపరిమితానందము నొందిరి. అం తట సోదరులైదుగురును ఇంద్రప్రస్థమను నొక చక్కని పుర మును నిర్మించుకొని యందుండి, అందఱను అరిగాండ్రులఁ జేసి కొని, తమ రాజ్యముఁ బెంచుకొనిరి. పెద్దవాఁడైన యుధిష్ఠి రుఁడు, సర్వప్రాచీన హిందూదేశరాజుల పైని దాను చక్ర వర్తియని చెప్పుకొనుటకు, రాజసూయ యాగమొకటి చేయ నిశ్చయించుకొనెను; విజితులైన భూపతులందఱును కప్ప ములు పట్టుకొని వచ్చి, చక్రవర్తియెడలఁ దమకుఁ గలభక్తిని దెల్పి స్వయముగాఁ బనిచేసి, రాజసూయ యాగకార్యము లందుఁ దోడ్పడవలయును. పాండవులకుఁ జుట్టమును మిత్రుఁ డును అయిన శ్రీకృష్ణుఁడు వారికడకు వచ్చి, చేయఁదలఁ చిన కార్యము మంచిదే, చేయవచ్చునని చెప్పెను. కాని యజ్ఞాచరణమున కొక యవరోధముండెను. జరాసంధుఁడను రాజు, నూఱుగురురాజులను బలియిచ్చి యొక యజ్ఞము చేయ నెంచి, యెనుబదియాఱుగుర నప్పుడే పట్టిబంధించి యుంచు కొనెను. వెళ్లి యాజరాసంధునితోఁ బోరవలెనని శ్రీకృష్ణుఁ డాలోచన చెప్పెను. తదనుసారముగా భీమార్జునులు వెళ్లి జరాసంధుని యుద్ధమునకు రమ్మని కోరిరి. అందుల కొప్పు కొని యతఁడు భీమునితో పదునాలుగురోజు లెడతెగకుండఁ బోరి, చివరకోడిపోయెను. కారాబద్ధులైన రాజులందఱు విముక్తులైరి.

పిమ్మట ధర్మజానుజులు నలుగురును, సేనలతో, దిగ్విజయార్థము, నలుదెసలకుఁ బోయి, రాజుల నెల్లర నోడించి, వారిని యుధిష్ఠిరుని క్రింది సామంతరాజులుగాఁ జేసిరి. చేసి తిరుగ వచ్చి, తెచ్చిన యమిత ధనమంతయు, మహాయజ్ఞమునకు వ్యయము చేయుటకై, అన్నగారి పాదములకడ నిడిరి.

జరాసంధుని చెఱనుండి విడుగడ నొందిన రాజులును, ధర్మరాజు తమ్ములచే జయింపఁబడిన రాజులును, రాజసూయమునకువచ్చి, ప్రభుభక్తిఁజూపి యుధిష్ఠిరుని సేవించిరి. వచ్చి యాగము చేయింపుఁడని ధృతరాష్ట్రుని సుతులనుగూడ ఆహ్వానముచేసి రప్పించిరి. రాజసూయానంతరమునఁ జక్రవర్తిగా మూర్ధాభిషిక్తుఁడై యుధిష్ఠిరుఁడు రాజాధిరాజనిపించుకొనెను. ఇదియే భావికలహములకు బీజమయ్యెను. పాండవుల మహావిత్తవైభవాధికారములు చూచి దుర్యోధనుఁడు సహింపలేక, యుధిష్ఠిరునిపైఁ గడు నసూయాగ్రస్తుఁడై యాగాంతమున నట నుండి తిరిగివచ్చి, బలిమిచే పాండవుల జయించుట యశక్యమని తెలుఁగునుగాన, జిత్తులచే వారినిఁ బడఁద్రోయుటకు పన్నుగడలు పన్నసాగెను. యుధిష్ఠిరుఁడు ద్యూతాభిలాషి; మాయజూదకాఁడును దుర్యోధనునకు దుర్బుద్ధులు చెప్పు దుష్పిశాచమును అగు శకునితో జూదమాడుటకు రమ్మని యొక దురదృష్ట దినమున నతనిని బిలిచిరి. హిందూదేశమునఁ, బూర్వకాలములో, క్షత్రియ వంశ

జుని యుద్ధమునకు రమ్మని చూతమని యెవరైనను గాలుదువ్వినప్పుడు, ఏమైనను సరే; అతఁడు దానికొప్పుకొని తన పరువు నిలుపుకొనవలెను. జూదమునకుఁ బిలిచినప్పుడు కూడ నట్లే యొప్పుకొని, యాడుట మర్యాదగాని యాడనని చెప్పుట యగౌరవాపాదకమని యెంచెదువారు. యుధిష్ఠిరుఁడు సర్వసద్గుణమూర్తియని పురాణము చెప్పుచున్నది. అట్టి మహాశాజర్షియైనవాఁడు సైతము ద్యూతాహ్వానమున కంగీకరింపవలసివచ్చెను. శకునియును అతనిపక్షమువారును దొంగపాచికలు చేసిరి. అందుచే నతఁడొక యాటతరువాత నొకయాట యాడి యన్నిటిలోను నోడిపోయెను. అపజయమువలనఁ గలిగిన ఖేదోద్రేకముచే అంతటితో ఆఁగక, ఆపాడుజూదములోఁ బడి, తనకున్న దంతయు పందెముగానొడ్డి యోడిపోయెను; తనయాస్తి, తనరాజ్యము, తనసర్వస్వమును బోయెను. ఇంకను ఆతమని శత్రువులు పురికొల్పుటచే, ద్యూతావసానమున పణముగా నొడ్డుట కితరమేమియు లేనందున, తనసోదరులను, తన్ను, తుదకు సుందరియగు ద్రౌపదిని ఒడ్డి—యందఱను గోల్పోయెను. అందుచే వారు సంపూర్ణముగా కౌరవులకు వశులైరి; కౌరవులు వారిని పెక్కువిధముల పరాభవించుటయేకాక, పశుప్రాయులై ద్రౌపదికి ఘోరమైన మానభంగముఁగావించిరి. ఎట్టకేలకు మన యుంధనృపతి మాధ్యస్థ్యము వహించి, యడ్డుపడి, వారి స్వాతంత్ర్యము మరల

హారికిచ్చి, మీరుపోయి మీరాజ్య మేలుకొనుఁడని పాండవు లతోఁ జెప్పెను. దానివలనఁ దనకు సంభవించు అపాయ మును జూచి, మఱియొకసారి జూదమాడుట కంగీకరింపుమని దుర్యోధనుఁడు తండ్రిని బలవంతపెట్టి యొప్పించెను:—అం దోడిపోవువారు పండ్రెండేండ్లు అరణ్యవాసమును, పిదప నేదో యొకపట్టనమున ఒకయేఁ డజ్ఞాతవాసమును చేయవల యును; ప్రచ్ఛన్నులై యున్నప్పుడు వారిని శత్రువులు గని పట్టినయెడల, పైవిధముగా మరలఁ బండ్రెండేండ్లడవులం దును ఒకయేఁడొరు లెఱుఁగకుండ నొకపట్టనమందును ప్రవా సము చేయవలెను; అట్లు చేసినపిమ్మటనే స్వదేశభ్రష్టులకు వారిరాజ్యము మరల నీయవలయును. అందలి యేర్పాటులివి. దీనియందుఁగూడ యుధిష్ఠిరుఁడే అపజయము నొందెను. స్వగృహాస్వదేశములనుండి వెడలఁగొట్టఁబడి పంచపాండవులు ను ద్రౌపదీ సహితులై యడవుల కేగిరి. వనములందును పర్వ తములందును వారు పండ్రెండేండ్లుండిరి. అట నున్నప్పుడు వారనేక శూరకృత్యములును సుకృతములును జేసిరి; అప్పు డప్పుడు దీర్ఘ తీర్థయాత్ర లేగుచు అనేక పుణ్యస్థలములు సందర్శించుచుండిరి. భారతమందలి యీభాగము—ఆరణ్య పర్వము—చదువుటకుఁ గడునింపుగను నీతిబోధకముగను ఉండును; అది వివిధ విషయములఁగూర్చి చెప్పిన ఉపాఖ్యాన ములతోను కల్పితకథలతోను నిండియున్నది. మత తత్వజ్ఞా

న విషయకములై మనోహరములై మహోదారములైన హిందూదేశపు పురాణగాథలందున్నవి. పాండవుల ప్రవాస కష్టములను సుసహములఁ జేయుటకై, అడవిలోనున్న సోదరులకడకు అనేకమహర్షులువచ్చి, హిందూదేశపు పురాతనపుకథలు చక్కనివనేకములు మనసునకెక్కునట్లు వారికిఁ జెప్పినారు. ఆ యన్నిటిలో నొక్కటిమాత్రమే యిట నేమీకుఁ జెప్పెదను.

పూర్వకాలమున అశ్వపతియను నొకరాజుండెను; ఆయనకొక కూఁతురుగలదు; ఆమెయందమైనది, గుణములు కడుమంచివి; కనుకనే హిందూపవిత్రమంత్రనామమగు సావిత్రి యను పేరామెకుఁ బెట్టినారు. ఆమెకువయసు రాఁగానే “ అమ్మా ! నీయిష్టమువచ్చిన వరుని నీవే యెన్నుకొనుము ” అని యామెతోఁ దండ్రి చెప్పినాఁడు. దీనిఁబట్టి ప్రాచీన హిందూదేశపు రాజకన్యలు కడుస్వతంత్రలై వారిభర్తలను వారే వరించుకొనెడు వారని మీకు స్పష్టముకాఁగలదు.

సావిత్రి తండ్రిచెప్పినట్లు చేయుట కొప్పుకొనెను. అంగరక్షకులను, వృద్ధులగు రాజసన్నిధానవర్తులను, ఇచ్చి తండ్రిపంపఁగా ఆమె బంగారు తేరెక్కి నానారాజస్థానములకుఁ జని పెక్కురు రాకొమరులఁ జూచెనుగాని యందెవరును ఆమెమనసునకు నచ్చలేదు. చివరకు సపరివారముగా ఆమె యొక యడవిలోనున్న ఋష్యాశ్రమమునకు వచ్చె

ను—అట్టి యరణ్యములను హిందూదేశములో మృగరక్షణా ర్థము ప్రత్యేకముగా అట్టేపెట్టెడువారు; అందలిమృగముల నెవరినిఁజంపనిచ్చెడువారుగారు; అచటి జంతువులు మనుష్య భయమించుకయులేక సంచరించెడివి. కొలఁకులలోనుండు చేఁపలుఁవచ్చి చేతిలోఁ బెట్టుకొన్న యాహారముఁదిని పోయె డివి. అందొకజంతువునైన హాతము చేయకుండ ననేక సహ స్రవర్షము లాయడవుల నట్టే పెరుఁగనిచ్చెడువారు. ముము క్షువులగు మునులును ముసలివారును అక్కడకువెళ్ళి లేళ్ళన డుమను పక్షులనడుమను గాఁపురముచేసెడివారు. దండ్యు లగు అపరాధులుసైత మచ్చట సురక్షితులై యుండెడివారు. సంసారముపై విసుగుపుట్టినవాఁడట్టి యడవులకేగి, ఋషిసాం గత్యము సంపాదించుకొని, వారి సన్నిధిని మతముఁగూర్చి ప్రసంగించుచు, తద్విషయములనే ధ్యానించుచు, తనజీవిత మందలి శేషకాలమట వెళ్ళఁబుచ్చుకొనెడువాఁడు.

ఇట్లుండఁగా, ద్యుమత్సేనుఁడను నొకరాజు తన శత్రు వులచే నోడింపఁబడి రాజ్యభ్రష్టుఁడయ్యెను—దానికితోడుగా ముసలితనమువచ్చి గ్రుడ్డివాఁడు కూడనయ్యెను. పాప! మీ యంధవృద్ధ నృపతి, తన రాణితోను కొడుకుతోను జని యొక యరణ్యము శరణ్యము చేసికొని కఠినతపోనిష్ఠుఁడై యట కాలము గడపుకొనుచుండెను. అతని పుత్త్రునిపేరు సత్యవంతుఁడు.

న్పపాఃబరయా స్థానములన్నియుఁ జూచినపిదప సావిత్రి, కడ కీయూశ్రమమునకు వచ్చెను. ఎంతగొప్ప రాజాధిరాజైనను, వెళ్ళి ఋషుల దర్శించి వారికి నమస్కారములర్పింపకుండ, ఋష్యాశ్రమముల దాఁటి పోఁగూడదు—ఆమహాపురుషుల యెడల మనసులోఁబుట్టు గౌరవభావములట్టివి. హిందూదేశములో మహాచక్రవర్తియైనను, తాను, జీర్ణవస్త్రధారియై కందమూలఫలములు దిని కాలక్షేపము చేయుచు అడవిలో నివసించిన యే ఋషి సంతతివాఁడో యని చెప్పుకొనుటకు ఎంతో కుతూహల పడును. మే మందఱము ఋషుల సంతతివారము. మతమునకుఁ జూపు మర్యాద యట్టిది. కనుక మూర్ధాభిషిక్తులం సైతము, మునుల పర్ణశాలల చెంతఁబోవునప్పుడు, లోపలికేగి వారి కభివందనములు చేయుట తమ కెంతో గౌరవముగాఁ దలఁచుకొందురు. గుఱ్ఱముమీఁదవచ్చుచున్నయెడల, దానిదిగి, వారిసన్నిధికి కాలినడకనుబోదురు; రథమెక్కివచ్చినచో, అదియును కవచమును ఆవలవిడిచిపెట్టి మఠిలోపలఁ బ్రవేశింపవలెను. పరమశాంతుఁడైన భక్తుని వేషముతోఁగాని యే యోధయును అట్టిపుణ్యాశ్రమములఁ జొరఁగూడదు.

సావిత్రి, మనవ్యుమత్సేనుని పర్ణశాలకువచ్చి, యూతపస్వికొడుకగు సత్యవంతునిఁజూచెను, చూచుటతోడనే ఆయన ఆమెహృదయమును చూఱకొనెను. పెద్దపెద్దర జఢ

వనములలోను ఆస్థానములలోను ఉన్న రాజపుత్రు లందఱను దప్పించుకొనివచ్చెనుగాని, ఋచట, ద్యుమత్సేనుని కాశ్రియమైయున్న యడవిలో నుండు సత్యవంతుడు, ఆమెకు హృదయచోరుఁడయ్యెను.

సావిత్రి తిరుగఁబుట్టినింటికి రాఁగానే "అమ్మా! తల్లీ! నీవు పెండ్లాడుట కిష్టమైనవాఁడెవఁడైన నీకగపడినాఁడేమో చెప్పవా! యని తండ్రి ప్రేమలూర నడిగెను. "నాయనగారూ! అగపడినారు" అని యెలసిగ్గుచే నెఱ్ఱవాఱిన చెక్కులతో ఆమె పలికెను. "ఆరాజకుమారుని పేరేమి?" యని తండ్రి యడిగెను. "ఇపుడు రాజపుత్రుఁడనుటకు వీలు లేదు నాయనగారూ! ఆయన, రాజ్యము గోల్పోయిన ద్యుమత్సేనుఁడుగారిపుత్రులు, పితృత్యక్తమేమియు లేని రాచబిడ్డ, వృద్ధులైయొక చిన్న యాకుటింటిలోనున్న తలిదండ్రులకు, శాకమూలాదులు సేకరించి తెచ్చి పెట్టుచు, వారికి సేవ చేయుచు, అడవిలో సన్యాసివలె జీవనము చేయుచున్నారు" అని సావిత్రి జవాబు చెప్పెను.

ఆమాటలు విని, అపు డచటికి వచ్చియున్న నారదమహర్షితో ఆమెజనకుఁ డాలోచన చేసెను. "అయ్యో! యిది యత్యశుభప్రదమైన వరణము" అని నారదుఁడు పల్కెను. "ఎందుచేతనో చెప్పుఁడు" అని యశ్వపతి యడిగెను. "ఇఁకఁ బన్నెండు మాసములలోపల ఆతరుణవయస్కుఁడు మరణిం

చును.'' అని నారదుఁడు పలికెను. ఆపలుకుల కులికిపడి "నాతల్లీ! సావిత్రీ! యింయువకుఁ డాకయేఁడాదిలో నీలు గునఁట, అంతట నీకు వైధవ్యము వచ్చును. అమ్మా! యిది యాలోచించుకొనుము. బిడ్డా! అట్టివానిని గోరుకొనుట మానుము, అల్పాయుష్కుఁడును అదృష్టహీనుఁడును అగు వరునకు నిన్నుఁ బెండ్లిచేయుటకు నేనెప్పు డొప్పుకొనను'' అని తండ్రి వచించెను. "నాయనగారూ! దానికేమియుఁ జింతింపకుఁడు; అన్యునివివాహమాడి నాయాంతరంగపాతివ్రత్యమును జెఱుపుకొనుమని చెప్పకుఁడు. సత్పురుషుఁడును శౌర్యవంతుఁడును అగునాసత్యవంతుఁడుగారినే ప్రేమపూర్వకముగా నామనసులో నాప్రాణనాయకునిగా గ్రహించినాను. కన్య వరించుట యొక్కసారియే కాని పెక్కుసార్లు గాదు, నాతి సత్యప్రతిజ్ఞనుండి యెన్నఁడును దొలఁగిపోదు.'' అని సావిత్రి ప్రత్యుత్తర మిచ్చెను. కూఁతుదృఢనిశ్చయ మెఱిఁగి తండ్రి మంచిదనెను. అంతట సావిత్రి సత్యవంతుని వివాహమాడి, తా స్వయముగా వరించుకొనిన భర్తతోఁ గాఁపురముచేయుచు అత్తమామల కుపచారము చేయుటకుఁ, బ్రశాంతచిత్తముతోఁ, దనతండ్రిగారి దివ్యభవనమును వీడి యడవికిఁబోయెను. సత్యవంతుఁడు మరణింపకతప్పనిరోజు సావిత్రికిఁ దెలిసినను, ఆమాట భర్త కెఱిఁగింపక దాఁచిపెట్టియుంచెను. సత్యవంతుఁడనుదిన మరణ్యామధ్యమున కేగి ఫలపుష్పములును వంటకట్టె

టును ఏఱి పర్ణశాలకుఁ దెచ్చుచుండెను. సావిత్రి వానితో వంటచేసిపెట్టి వృద్ధులకుఁ బరిచర్యలు చేయుచుండెను. ఇట్లు వారు సుఖముగాఁ గాలము గడపుకొనుచుండఁగాఁ బతిప్రాణాపహామైన దుర్దినము తారసిల్లెను. ఇఁక మూఁడురోజులుమాత్రమే యున్నవి. కఠినవ్రతదీక్షఁ బూని, యాసతీమణి, యామూఁడు రాత్రులును, ఘోరమైన యుపవాస తపశ్చర్యలతోను, జాగారములతోను గడపెను. దుఃఖసముద్రములోఁ బడి, తెప్పవాల్పక, కన్నీళ్ళు గ్రుక్కుకొనుచుఁ, దీవ్రభక్తితో భగవంతునిఁ బ్రార్థించుకొనుచు ఆమె మూఁడురాత్రులు వెళ్లఁబుచ్చెను; అంతట మహాభయంకరమైన నాఁటిసూర్యోదయ మయ్యెను. ఆరోజున నొకక్షణమైనను భర్త తనదృష్టిపథమునకు దూరమైపోవుట యామె సహింపలేకపోయెను. కావున, యథాపూర్వముగాఁ దనభర్త శాకపదార్థములును వంటచెఱకును సంగ్రహించి తెచ్చుట కేగునపుడు, “ఆయనతోఁగూడ నన్నును బోనిం” డని భర్తృజనకులఁ బ్రార్థించి, వారిసమ్మతిని బడసి, సావిత్రి పతి నంటిపోయెను. అడవిలో నుండఁగా నాకస్మికముగా “ప్రియురాలా! సావిత్రీ! యేమోకాని, నాతల దిరుగుచున్నది, సర్వేంద్రియములును సోలిపోవుచున్నవి. నాకు నిద్రవచ్చుచున్నట్లున్నది. నీప్రక్కఁ గొంచెముసేపు పరుండనిమ్ము.” అని సత్యవంతుఁడు, మూర్ఛాభీతిని వెలిపుచ్చుచు గద్గదకంఠముతో, నాల్కతొట్రుపాటుతోఁ, దనకాం

తామెతోఁబల్కెను. భయకంపితురాలై “జీవేశా! ప్రాణప్రియా! వచ్చి, మీశిరస్సు నాయూరువులపైఁ బెట్టుకొని నిద్రింపుఁడు” అని యామె చెప్పెను. ఆయన, సలసలఁ గాఁగుచున్న తనతల సతియూరుతలముపైఁ బెట్టి, వెంటనే యొక దీర్ఘశ్వాస మూర్చి ప్రాణములు విడిచెను. అంతట నామె, కనులనుండి కన్నీటివఱదలు కుమ్మరించుచు, కాంతుని కౌఁగిటఁ బట్టుకొని యేడ్చుచు, ఏకాకినియై ఆనిర్జనారణ్యములోఁ గూరుచుండియుండఁగా, సత్యవంతునాత్మఁ గొనిపోవుటకు యమదూతలు వచ్చిరి; కాని తల తనతొడపై నిడుకొని పతిమృతకళేబరముతోఁ గూరుచుండియున్న సావిత్రిదగ్గఱకు వారు రాలేకపోయిరి. ఆమెచుట్టును అగ్నిజ్వాలామయమైన యొకపరివేష మేర్పడియుండుటచే, యమభటులలో నొక్కఁడైనను ఆయగ్నిమండలములోఁ జొరఁజాలకపోయెను. వెఱచి వెనుకకుఁ బోయి, వారందఱును మరణాధిదేవతయగు యమధర్మరాజుకడకు మరలఁజని, ఆమనుష్యునియాత్మ నేల తాము తేలేకపోయిరో చెప్పుకొనిరి.

అది విని మరణదేవతయు, మృతవిచారణకర్తయు, దండనాయకుఁడును, అగు యముఁడే స్వయముగా వచ్చినాఁడు. ఈభూలోకమునఁ బుట్టి మరణించినవారిలో ఆయన మొట్టమొదటివాఁడు, అందుచేతనే మృతపురుషుల కందఱకు న్యాయాధ్యక్షుఁడైనాఁడు. మరణించినపిమ్మట మనుష్యుఁడు దం

డింపఁదగినవాఁడో, పారితోషిక మిచ్చి బహూకరింపఁదగిన వాఁడో, విచారించి నిశ్చయింపవలసినవాఁ డతఁడే. కనుక స్వయముగా నతఁడు వచ్చినాఁడు. దేవతగనుక, సతీత్వమహిమచేఁ గలిగిన ఆయగ్నికీలావలయములోఁ జొరఁగలిగినాఁడు. సావిత్రికడకు వచ్చి "బిడ్డా! యీశవమును విడిచిపెట్టుము, మనుష్యులందఱు మర్త్యులని యెఱుఁగుము; మరణించినమర్త్యుల లో నేనుబలిష్ఠముఁడను; అప్పటినుండియు ప్రతిమానవుఁడును మరణింపవలసి వచ్చినది. మనుష్యుఁడైనవాఁడు చావకతప్పదు." అని యముఁడుపల్కెను. ఆమాటలువిని సావిత్రియావలి కేఁగెను; యముఁడాజీవుని లాగుకొనిపోవుచుండెను. స్వల్ప దూరముపోయి, యెండాకులపైని నడచుచు నెవరోవచ్చుచున్న ట్లడుగులచప్పుడు చెవినిబడఁగా యముఁడు వెనుకకుఁదిరిగి చూచి "బిడ్డా! సావిత్రీ! ఏలనీవు నావెంటవచ్చుచున్నావు; ఇది [చావు] సర్వజనులకు అవశ్యాను భోక్తవ్యముసుమా!" అని పల్కెను.

సా:—తండ్రీ! నీవెంట నేను వచ్చుచుండుటలేదు. ప్రేమప్రేరితనై నాప్రియుని నేననుగమించుచున్నాను. ఇది కూడ స్త్రీకి విధి వ్రాసిన వ్రాఁతయే. సనాతనధర్మము—ఆయనశ్వరతత్త్వము—పరమానురాగభరితుఁడైనపతిని పవిత్రితమమైన సతిని విడఁదీయదు.

యము:—నీపతిని బ్రతికించుటదక్క నింకేవరమైనఁగోరుకొనుము

సా:—మరణాధిదేవతా! దయచేసి నీవు నాకు వరమీయ నెంచునెడల, అంధత్వముఁ బోఁగొట్టి నా మామగారిని సుఖజీవిని జేయుము.

య:—శ్వశురభక్తియుక్తవును ధర్మాత్మురాలవును అగు నోబిడ్డా! పవిత్రమైన నీ కోరిక సఫలమగుఁగాక!

అని చెప్పి యముఁడు సత్యవంతునిజీవాత్మతో సాగిపోవుచుండెను. వెనుకనుండి మరల నాయడుగుల చప్పుడు వినఁబడెను. తిరిగిచూచి,

య:—అమ్మా! సావిత్రీ! నావెంట నింకనువచ్చుచున్నావు.

సా:—ఔను! తండ్రీ! అట్లుచేయుట మానలేకున్నాను. తిరిగిపోవ నేనెంత ప్రయత్నము చేసినను, నామనసు నాభర్తతోఁ బోవుచున్నది, దానితో నాబొందియుఁ బోవుచున్నది. నాయాత్మ యిదివఱకే పోయినది, వీలన, ఆయాత్మలో నాయాత్మకూడనున్నది. నీవు చైతన్యమును గొనిపోవునప్పుడు శరీరము దానితోఁ గూడ రాకుండునా?

య:—సుందరీ! సావిత్రీ! నీమాటలు వినుటవలన నాకు సంతోషమయినది. నన్నింకొక వరమడుగుము. నీభర్తను బ్రతికింపుమని యడుగఁగూడదుసుమా!

సా:—అయ్యా! నాకు మఱొకవర మనుగ్రహించునెడల,

నామామగారి రాజ్యమును ధనమును బోయినవిగాన, నవి యాయనకుఁ దిరుగఁ బ్రసాదింపుము.

యః:—ప్రియపుత్రికా! యీవరముకూడ నిచ్చితిని. ఇఁక నింటికిఁబొమ్ము. సజీవమానవు లెవ్వరును శమనుఁడ నైన నాతో రాలేరు.

అని చెప్పి యమధర్మరాజు పోవుచుండెను. సావిత్రి వినయవిశ్వాసములతోఁ, దనమృతభర్త వెంటనింకను బోవుచుండెను.

యః:—(తిరిగిచూచి)—మహోదారవగు నోసావిత్రీ! నిరుపమోగమైన దుఃఖముతో నిట్లు వెన్నాడి రాకుము.

సా:—మీరు నాప్రాణప్రియు నెటకుఁ గొనిపోవుచున్నారో నేనును అటకు రాకుండ నుండలేను.

యః:—అయినను, సావిత్రీ! వినుము. నీభర్త పాపి యనుకొందము, నరకమునకుఁ బోవలసిన వాఁడనుకొందము, అప్పుడు సావిత్రి తన ప్రియునితోఁ బోవునా?

సా:—నాపతి యెటకుఁబోవునో నేనటకుఁ బోవుటయే నాకుఁ బరమానందము—చావుకానిండు, బ్రతుకు కానిండు—నరకముగానిండు, నాకలోకముగానిండు!

యః:—బిడ్డా! నీమంగళవచనములు నాకతి మనోహరము లగుచున్నవి. ఇంకొకవరము కోరుకొనుము—ఇచ్చె

దను—కాని మరణించినవారు మరల బ్రతుకరను మాట మాత్రము మఱచిపోకుము.

సా:—అట్టియనుజ్ఞ నాకిచ్చితిరిగాన నొకవరముకోరుకొనెదను. నామామగారి రాజవంశ మంతరింపకుండ, ఆయనరాజ్యము సత్యవంతుఁడుగారి పుత్రులకువచ్చునట్లు అనుగ్రహింపుఁడు.

య:—(మందహాసము చేయుచు)—బిడ్డా! నీకోరిక యట్లే యీడేఱుఁగాక! ఇదిగో నీభర్త ప్రాణములు! అతఁడు మరల జీవించి బిడ్డలతండ్రియగును; నీబిడ్డలుకూడ యుక్తకాలమున రాజ్యపరిపాలకులగుదురు. మీయింటికి మీరు పొండు. ప్రేమ మృత్యువును జయించినది. నీయట్టి యనురాగవతిని స్త్రీజాతిలో నేనెన్నఁడును జూడలేను. చిరస్థాయి యైయుండు సత్యప్రేమ యొక్క శక్తికి, మరణాధిదేవతనైన నాయొక్క శక్తి కూడఁ జాలదనుటకు నీవే ప్రబలనిదర్శనమవు!

ఇదియే సావిత్రికథ. మరణదేవతకూడ మార్కొని జయింపలేని ప్రవిమలప్రేమయొక్క యుద్దండ బలముచేత, గతించిన భర్తప్రాణములను యమునంతవాని చేతినుండి లాగి తెచ్చుకొన్న సావిత్రివలె జీవయాత్ర సాగించుకొనుటకు హిందూదేశములోని ప్రతికన్యయును అభిలాషపడవలయును.

గ్రంథ మనేకములైన యుపాఖ్యానములతో నిండియున్నది. ప్రపంచ గ్రంథజాలములో మహాభారత మొక గొప్పగ్రంథమనియు, అందుఁ బదునెనిమిది పర్వములును రమారమియొక లక్షశ్లోకములును ఉన్నవనియుఁ బూర్వోక్త నేఁ జెప్పితినిగదా !

మనమూలకథకు మరలమనము వత్తము. రాజ్యభ్రష్టులైన పాండవసోదరులను అరణ్యములో విడిచివచ్చినాము. అటులైనను కపటియైన దుర్యోధనుఁడు వారిని సుఖముగా బ్రతుకనీయలేదు; అనేక మాయోపాయములు పన్ని వారిని హింసింపఁజూచినాఁడు. కాని యాప్రయత్నము లన్నియు విఫలములైనవి.

వారరణ్యవాసులై యుండఁగా జరిగిన యొకకథ మీ కిటఁ జెప్పెదనువినుఁడు. అడవిలో నొకనాఁడు వారు దప్పిచే బాధపడుచున్నందువలన, వెళ్ళి మంచినీళ్లు పట్టుకరమ్మని యుధిష్ఠిరుఁడు నకులు నంపెను. వెంటనే యతఁడు జలాశయమున్న దెసకుఁ జని యట స్ఫటికసన్నిభములైన స్వచ్ఛాంబుపులుగల యొకకొలను గాంచి, దానిలో దిగి, త్రాగ దగఁ దీర్చుకొనఁబోవుచుండఁగా "అఁగుమాఁగుము బిడ్డా! నాప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లిచ్చి మఱి నీరు త్రాగుము" అను అశరీరవాక్కొకటి వినఁబడెను. పిపాసాపీడితుఁడై యున్న

నకులుఁడా మాట లక్ష్యముసేయక నీళ్ళు త్రాగి వెంటనే విగత జీవుఁడై క్రిందఁబడెను.

నకులుఁ డెంతసేపటికిఁ దిరిగి రానందున, సోదరుని వెదకి కనుఁగొని నీళ్లుపట్టుకొని రమ్మని ధర్మరాజు సహదేవు నంపెను. సహదేవుఁడు కొలఁకుకడకుఁ బోయి మృతుఁడై పడియున్న సహోదరుఁ జూచి, చాల దుఃఖించి, మిక్కిలి దాహముచే బాధపడుచుండుటచేతఁ గొలను సొచ్చి నీళ్లు త్రావఁబోఁగా, వెనుకటియట్లే "బిడ్డా! మొదట నాప్రశ్నల కుత్తరమిచ్చి, పిదప జలపానము చేయుము." అనుమాటలు వినఁబడెను. అతఁడుకూడ నామాటలు సరకుచేయక, దగఁదీర్చుకొని, ధరణిపై మృతుఁడై పడెను. తరువాత ధర్మజుఁ డట్లే, యొకనితరువాత నొకనిగా, విజయభీముల నంపెనుగాని వారుకూడను ఆనీరు త్రాగి చచ్చి పడిపోయినందువలన మరల రాలేదు. అంతట యుధిష్ఠిరుఁడు, స్వయముగా తనతమ్ము లేమైరో కనుఁగొనుటకై, లేచివెళ్లి, ఆసుందర సరస్సునొద్దకు వచ్చి యటఁ జచ్చిపడియున్న తమ్ములఁగని యపారదుఃఖభరితమైన హృదయముతో విలపింపఁజొచ్చెను. వెంటనే వెనుకటిరీతిని ఆకాశవాణి యిట్లుపలికెను:—"బిడ్డా! ముందువెనుకలు చూచుకొనక, తొందరపడి ప్రవర్తింపకుము. చిన్నచేపలఁ దిని జీవించు నొక బకరూపమునున్న యక్షుఁడను నేను. నాచేతనే నీతమ్ములు యముని కధీనులుగాఁ జేయఁబడినారు. రాజ

కుమారా! నేవేయుప్రశ్నలకు జవాబీయకుండఁ జొరఁబడితి వేని, యెంతవాఁడవైనను, నీ వైదవశవమ వగుదువు. తొలుత నాప్రశ్నల కుత్తరమిచ్చి, తరువాత, నోకుంతీపుత్రా! త్రాగి దాహముఁ దీర్చుకొని, కావలసినంతనీరు పట్టుకొని వెళ్లుము.”

“నాకుఁ దెలిసినంతవఱకు, నాబుద్ధికి గోచరించినంతవఱకు, నీవు పృచ్ఛించువానికిఁ బ్రత్యుత్తరములిచ్చెదను. అడుగుము.” అని యుధిష్ఠిరుఁడు మాఱుపల్కెను. అంత యక్షుఁడతని కనేకప్రశ్నలువేసెను; వానికన్నిటికిని యుధిష్ఠిరుఁడు సంతృప్తికరములైన సముత్తరములిచ్చెను. “ఈప్రపంచమం దన్నిటిలోను అత్యాశ్చర్యకరమైన విషయమేది?” అనునది యడిగిన ప్రశ్నలలోనొకటి. “తోడిప్రాణు లహరహమును జచ్చుచుండుటఁ జూచుచుండియు, మిగిలినవారు తాము శాశ్వతజీవులనుకొందురు. నిత్య మరణదర్శనమగుచున్నప్పటికిని, తామరణింతునని యెవ్వఁడును నమ్మఁడు. ఇది విచిత్రమైన విషయము” దానికాతఁడిచ్చిన జవాబిది. “మతపరమార్థరహస్య మెఱుఁగుమార్గమేది?”అనునది మఱియొకప్రశ్న. “యుక్తివాదమువలననేదియు నిర్ణీతముకాఁజాలదు, సిద్ధాంతములు పెక్కులున్నవి, పరస్పర విరుద్ధములై భిన్నరూపములుగా వేదములున్నవి, అభిప్రాయభేదములేని మహాత్ము లిరువురైనను లేరు. మతరహస్యమంతయు మహాగుహానిబిడాంధకార మగ్నమైనట్లున్నది. కనుక మహాపురు

షులు త్రొక్కినమార్గమే అనుసరణీయమైనమార్గము" అనునది దానికిచ్చినప్రత్యుత్తరము*.

అంతట యక్షుఁడిట్లనియెను:— "చాలసంతోషించితిని. నేను బకాకారముననున్న న్యాయాధిదేవతను, ధర్ముఁడనువాఁడను; నిన్నుఁ బరీక్షించుటకు వచ్చినాను. ఇఁక నీతమ్ములమాట! అందొకఁడును జావలేదు, మూర్ఛయు అదంతయు నామాయ. ఓభారతవంశ నృపపుంగవా! అహింస నైహిక సుఖలాభము లన్నిటికంటెను అధికముగా నీవెంచితివిగాన నీతమ్ములందఱు జీవించి యుందురుగాక!" యక్షుఁడటు పల్కఁగానే పడియున్న పాండవులందఱును లేచి కూరుచుండిరి.

యుధిష్ఠిరరాజు ప్రకృతియెట్టిదో యిందించుక కాన్పించుచున్నది. అతఁడిచ్చిన యుత్తరములవలన, రాజనుటకంటె యోగియుఁ దత్వవేత్తయు ననుటకే యతఁడర్హుఁడైనట్లు మనకుఁ దోఁచును.

---

* ఇట్లువేసిన పెక్కుప్రశ్నలకిచ్చిన సదుత్తరములువిని సంతోషించి "మృతులైపడియున్న నీతమ్ములలో నెవని నేనొకనిఁ బునర్జీవితుని జేయుదును. వానిఁ గోరుకొను"మని యక్షుఁడు చెప్పెను. నకులుఁ బ్రతికింపుమని ధర్మజుఁడడిగెను. "ఇదేమివిపరీతమయ్యా! బాహుబల సంపన్నుఁడగు భీముని, ధనుష్చక్రవర్తియగు నర్జునుని,మాని నకులునిగోరికొంటివి!" అనియక్షుఁడు ప్రశ్నించెను. "అయ్యా! మాకిరువురు మాతలు. నాతల్లి పెద్దకొడుకనైన నేను బ్రతికి యుంటిని. మాసవతి తల్లిగారు పుత్రశూన్యురాలు గాకుండ నకులుఁ బ్రతికింపుమని ప్రార్థించితిని. ఇందేమి విపరీతమున్నది?" అని ధర్మరాజు పలికెను.

ప్రవాసకాలములో నపుడు పదుమూఁడవ సంవత్సరము సమీపించుచున్న దిగాన, దమ కుచితమని తోఁచినమాఱువేషములతో విరాటురాజ్యమునకు వెళ్లి యటనుండుఁడని యతఁడు వారికిఁ జెప్పెను.

తదనుసారముగా, ద్వాదశ వర్ష విపినవాసమైనపిమ్మట, నొకయేఁ డజ్ఞాతవాసము చేయుటకై, వారు వేఱువేఱు వేషములు వేసికొని విరటురాష్ట్రమునకు వెళ్లి, రాజకుటుంబమునకు సేవకులుగా నంగఁ ప్రవేశించిరి. యుధిష్ఠిరుఁడు ద్యూతమందారితేఱిన విప్రసభికుఁడుగా రాజుకొలువుచొచ్చెను. భీముఁడు వంటలవాఁడయ్యెను; అర్జునుఁడు షండరూపధారియై, రాజపుత్రియగు ఉత్తరకు భరతవిద్య నేర్పుగురువుగా నియుక్తుఁడై రాజాంతఃపురమున నుండెను; నకులుఁడు రాజాశ్వపాలకుఁ డయ్యెను; సహదేవుఁడు గోగణసంరక్షకుఁడుగా నియమింపఁబడెను; సైరంధ్రి వేషముతో ద్రౌపదిగూడ (రాణి) రాణివాసము చొచ్చెను. అట్లు స్వస్వరూపముల మఱుఁగుపఱచుకొని పాండవసోదరులు నిరుపద్రవముగా ఆయేఁడాదియుఁ గడపిరి; వారినిఁగనిపట్టుటకు దుర్యోధనుఁడు చేసినప్రయత్నమంతయు వ్యర్థమయ్యెను. సంవత్సర మైనవెంటనే వారు బయలుపడిరి. తత్పూర్వము ప్రకాశితులు గాలేదు.

అంతట ధర్మరాజు, తమవంతునకువచ్చిన అర్ధరాజ్యము తమకీయవలయు నని, యొకదూతచే ధృతరాష్ట్రునకు రాయ

కారమంపెను. కాని దుర్యోధనుఁడు తనపినతండ్రిబిడ్డలకు పరమద్వేషియగుటచే, న్యాయ్యముగా నడిగిన వారివంతు వారి కిచ్చుట కొప్పుకొనలేదు. ఏదేనొకరాష్ట్రమిచ్చినఁ జాలు ననిరి; చివర కైదుగురకును అయిదూళ్ళిచ్చినను బుచ్చుకొందుమనిరి. అన్న నేమి? మూర్ఖపుఁబట్టుదలతో, యుద్ధము చేయకుండ సూదిమొనమోపుటకుఁ గావలసినంత ప్రదేశమైనను ఈయ ననిి, దుర్యోధనుఁడు బాహాటముగాఁ జాటి చెప్పెను. సఖ్యముతో నుండుఁ డని ధృతరాష్ట్రుఁడు పలుమాఱు బతిమాలి చెప్పెను; ఎంత చెప్పినను లాభము లేకపోయెను. యుద్ధమును, తన్మూలమున నగు బహుబంధుమరణములను ఆఁపుటకు కృష్ణుఁడు కూడ స్వయముగా వెళ్ళి ప్రయత్నించెను; ఆస్థానముననుండు వయోవృద్ధులును జ్ఞానవృద్ధులును అట్టిప్రయత్నములే చేసిరి; కాని సామముచే వారు రాజ్యవిభాగము చేసికొనుటకుఁ గావించిన సంధిప్రయత్నము లన్నియును నిష్ప్రయోజనములయ్యెను. కనుక, ఉభయపక్షములవారును యుద్ధసన్నాహములు చేసిరి; రణప్రియులందఱు, క్షత్రియజాతివారంతఱు, ఆ యుద్ధములోఁ జొరఁబడిరి.

అందుఁ బ్రాచీన హిందూదేశపు క్షత్రియాచారములన్నియు నవలంబింపఁబడినవి. దుర్యోధనుఁ డొకపక్షమును యుధిష్ఠిరుఁ డొకపక్షమును బుచ్చుకొనిరి. గౌరవవంతులైన పురుషులు మొదటఁ దమ్ముఁ గోరినవారి కోరికఁ దీర్చుచు

గనుక, దక్షిణమే సాహాయ్యార్థము, యుధిష్ఠిరుఁడు చుట్టు పట్లనున్న రాజులకు రాయబారులనంపెను. ప్రార్థనాపౌర్వాపర్యము ననుసరించి, పాండవులపక్షమో కౌరవులపక్షమో చేరుటకు, ఎల్లదిశలనుండియు వీరపురుషులు వచ్చి యుండిరి—అన్నయొక వైపునను అనుజుఁడొక వైపునను, తండ్రియొక ప్రక్కను తనయుఁడొక ప్రక్కను, ఉండుట తటస్థించెను. ఆనాఁటి యుద్ధధర్మము లన్నిటికంటెను అతివిచిత్రము లైనవి; పగలుచేయు యుద్ధము ముగిసి సాయంకాలము రాఁగానే, పరస్పరవిరోధులు పరమమిత్రులై యొకరి శిబిరమున కొకరుగూడఁ బోవుచుండెడివారు; ఉదయము కాఁగానే, మరల నొకరితో నొకరు పోరుటకు సమకట్టెడువారు. మహమ్మదీయ దండయాత్రా కాలము వఱకు, హిందువులీవింతయుద్ధసంప్రదాయమును విడువక యాచరించుచునే యుండిరి. అదిగాక, గుఱ్ఱ మెక్కియున్నవాఁడు పాదచారియై యున్నవానిని గొట్టఁగూడదు; ఎవఁడును బాణాదియుద్ధసాధనములకు విషముఁబూయఁగూడదు; అసమానయుద్ధము చేసిగాని, అన్యాయయుద్ధము చేసిగాని, కపటాదులచేఁ గలుగు లాభము నొందికాని, శత్రువులను జయింపరాదు. ఈనియమముల నెవఁడేని యించుకంతయైన నతిక్రమించినయెడల, వానినెంతయో యవమానించి యపకీర్తిపాలు చేసి త్యజించెడువారు. క్షత్రియులందఱు ఆరీతిగా సుశిక్షితులై సదభ్యా

సములు గావించుకొనినారు. ఏషియామధ్యభాగమునుండి విదేశీయులు వచ్చి హింధూదేశముపై దండెత్తినప్పుడు, హిందువులు వారిని సరిగానన్నేచూచి వారితో ధర్మయుద్ధము చేసినారు; పెక్కుసారులు వారిని జయించి, జయించినపుడెల్ల బహుమతులు మున్నగువానితో వారిని వారిదేశములకుఁ దిరుగ నంపెడువారు. పరరాష్ట్రి మన్యాయముగా ఆక్రమించుకొనఁగూడదనియు, నిర్జితుఁడైన శత్రువు, నతనిస్థితి కనుగుణమైన మర్యాదతో, నతనిదేశమునకుఁ దిరుగఁ బంపవలయుననియు, యుద్ధస్మృతిలో విధింపఁబడి యున్నది. మహమ్మదీయ జేతలు తద్వ్యతిరిక్తముగా, హిందూరాజులను జూచినారు; ఒకసారి వారు తమచేతిలోఁ జిక్కినయెడల, అనుతాపలేశరహితులై, వారిని వినాశము చేసినారు.

ఆరోజులలో—భారతయుద్ధకాలములో—యుద్ధవిద్య యనఁగా కేవలధనుర్బాణముల నుపయోగించుట నేర్పునది గాదు; మంత్రధ్యానాదులచే మహాస్త్రముల సంపాదించుకొని ప్రయోగించుమార్గము నది విశేషముగాఁ గఱపుచుండెడిది; ఈమాట మీరు మఱవఁగూడదు; అట్లు గ్రంథము చెప్పుచున్నది. ఒక్కఁడు దశలక్షసంఖ్యాక మగుదళముపై డీకొని, తలఁచుకొన్నయెడల దానినంతను దగ్ధము చేయఁగలిగెడువాఁడు! ఒక్క బాణ మేసి దానినుండి యనేకసహస్రశరాళని వర్షముఁ గురియించెడువాఁడు! దేనినైనను ఇట్టె దహించివేయఁ

గలిగెడువాఁడు!—ఇట్టివిద్యావిఖ్యాతశస్త్ర లనేకము, లప్పటివారి కుండెడివఁట. రామాయణ మహాభారతగ్రంథముల రెంటిలోఁ గూడఁ గానిపించు నతివిచిత్రవిషయ మింకొకటి గలదు—ఈ మంత్రప్రేరితములగు అస్త్రములతోపాటు అప్పటికే తుపాకులు పిరంగులుగూడ నుపయోగపడుచున్నట్లు కాన్పించుచున్నది. చీనావారును హిందువులును ఈపిరంగు లతిప్రాచీనకాలమునుండియు ఉపయోగపఱుచుకొనుచుండిరి. లోహనాళములతోఁ జేయఁబడి, మందుతోను గుండ్లతోను నింపఁబడి, శతసంఖ్యాకులగు మనుష్యుల నొక్కవ్రేటునఁ జంపఁగల చిత్రమైన యుద్ధసాధనము లనేకములు ప్రాచీనపట్టనప్రాకారములపై నుండెడివి. చీనావారు, తమ మంత్రబలమున నొక దయ్యము నినుపగొట్టములోఁ బ్రవేశపెట్టెడువా రనియును, కొంచెము నిప్పు రంధ్రముకడఁ బెట్టువెంటనే, పెద్ద భీకరనిర్ఘోషముతో ఆదయ్యము పైకి వచ్చి అనేకజనులను మారణము చేసెడిదనియును, పామరజను లనుకొనెడువారు.

ఆప్రాచీనకాలములలో జనులు మంత్రాస్త్రములతో యుద్ధము చేసెడివా రని చెప్పితిఁగదా. ఒక్కఁడు వేనవేలు శత్రువులతోఁ బోరఁగలిగెడువాఁడు. వారి సాంగ్రామికకౌశలములును వారి వ్యూహరచనలును వారి కుండెడివి. సేనలో పదాతు లుండెడివారు, తురగము లుండెడివి; గజములు రథములు అను మఱిరెండుభాగము లుండెడివి; కాని నవీను లవి

మూని వేసికొన్నారు. నూర్లకొలఁది యేనుఁగులమీఁద మనుష్యులెక్క యొక సేనాభాగముగా నుండెడివారు, పెద్దయినుపరేకు లాయేనుఁగులకుఁ గవచములుగా తొడిగెడువారు, ఆ యేనుఁగులు వెళ్లి శత్రుసంఘములపైఁ బడియెడివి. తరువాతివి రథములు; ఈప్రాచీనరథముల బొమ్మలు మీరందఱు చూచియేయున్నారు; ప్రతిదేశమువారు వాని నుపయోగించుకొనుచుండెడువారు. ఆరోజులలో ఈనాలుగును సేనాభాగములుగా నుండెడివి.

మరల మనకథకు మనము వత్తము. ఉభయపక్షములవారునుగూడ్క కృష్ణుని తమవానినిగాఁ జేసికొనఁగోరిరి. కాని చేత నాయుధముఁ బూని స్వయముగా యుద్ధముచేయుట కొప్పుకొనక, అర్జునునకు రథసారథిగాను పాండవులకు ధీసచివుఁడుగాను ఉందునని ఆయన చెప్పెను; మహాయోధులు గల తనసేనను దుర్యోధనుని కిచ్చెను.

అంతట, విపులమైన కురుక్షేత్రమం దామహాయుద్ధము జరిగెను; భీష్మ ద్రోణ కర్ణులును, దుర్యోధనుని తమ్ములును, ఉభయపార్శ్వముల వారి రక్తసంబంధులును, ఇతరవీరులనేకులును, అందుఁ బోరాడి చచ్చిరి. యుద్ధము పదునెనిమిదిరోజులు జరిగినది. యుద్ధమునకుఁ జొచ్చిన పదునెనిమిది యక్షౌహిణులలోను జావక మిగిలినవారు మిక్కిలితక్కువ

ముంది. తుదకు దుర్యోధనుండు చచ్చుటతోడనే యుద్ధము ముగిసి పాండవులకు జయ మయ్యెను.

తరువాత గాంధారియు, గతించినవీరుల వితంతువులును, మిగుల విలపించినారు; హతయోధుల యుత్తరక్రియలు జరిగినవి.

యుద్ధసంబంధ మైన విశేషములలో మహత్తమమైన దేదియనఁగా అద్భుతమై యనశ్వరమై యుండు భగవద్గీత. అది హిందూదేశములో ప్రజాప్రియమైన పరమవేదము. అన్ని యుపదేశగ్రంథములలోను ఉదారతమమైనది. కురుక్షేత్రసమరతలమందు, యుద్ధప్రారంభమునఁ, కృష్ణార్జునులకు జరిగిన సంభాషణమే ఆగీతాగ్రంథము. ఆపుస్తకము మీలోఁ జదువనివా రున్నయెడలఁ, జదువుఁ డని నే నిపుడు సలహా యిచ్చుచున్నాను. దానిప్రభావమది మీదేశముపైని సైతము యెంత వఱకు గపజేసినదో మీరు తెలిసికొనినఁజాలును! ఎమర్సన్ గారి కాకస్మికముగా నుద్భవించిన యావేశజ్ఞానమునకు మూలమేదియో యెఱుఁగుదురా ? అది యీగీతాగ్రంథమే ! ఆయన కార్లైల్ గారిని చూచుటకు వెళ్ళినారు; కార్లైల్ గా రాయన కొకగీతాగ్రంథముప్రీతి బహుమానము చేసినారు; ఆచిన్న పొత్తమే ఆయన ఐకమత్యోద్యమమునకుఁ గారణభూత మైనది. అమెరికాలో బయలుదేఱిన మహోద్యమము లన్ని

యును, ఏదోయొకవిధముగా, ఆస్తికమతోద్యమమువలనఁ బ్రేరితములై, యీయుద్యమము వారికి ఋణపడి యున్నవి.

గీతాగ్రంథములో వచ్చుప్రధానపురుషుఁడు శ్రీకృష్ణుఁడు. నేజరెత్తులోని జీజస్సుగారిని అవతారపురుషునిగా భావించి మీ రెట్లుపూజింతురో, అట్లే హిందువు లనేక భగవదవతారపురుషులను బూజింతురు. ధర్మమును రక్షించి అధర్మమును నశింపఁజేయుటకు, లోకముయొక్క యక్కఱలను బట్టి, అప్పుడప్పు డవతరించినవా, రొకరిద్దఱేగాక యనేకు లున్నారని వారి నమ్మకము. ఒక్కొక్కమతశాఖవారి కొక్కొక్కయవతారమూర్తి చొప్పున ననేకు లున్నారు; వారిలో కృష్ణుఁ డొకఁడు. తదితరావతారపురుషులను సేవించువారి కంటె శ్రీకృష్ణభక్తు లెక్కువమంది యున్నారని చెప్పవచ్చును. భగవదవతారములలో కృష్ణావతారము పూర్ణతమమైన యవతార మని ఆయన భక్తులు చెప్పుదురు. ఎందుచేత ?—“ బుద్ధాద్యవతారములను జూడుఁడు ! వారు కేవల సన్యాసులు. పెండ్లియాడి సంసారము చేసికొనువారి కష్టసుఖములు వారు చూచినారుగారు; వారికిని వీరికిని సాధర్మ్య మెట్లుండఁ గలదు ? కృష్ణునిఁజూడుఁడు ! పుత్రులలో నట్టి పుత్రుఁడు లేఁడు; రాజులలో నట్టిరాజు లేఁడు; తండ్రులలో నట్టితండ్రి లేఁడు; తా నుపదేశించిన యద్భుతోపదేశము లెల్ల స్వయముగా నాచరించి తనజీవితము నందంతటఁ జూపినాఁడు.

కావునఁ గృష్ణావతారము పరిపూర్ణావతారము" అని వారు చెప్పుదురు. "ఉద్దండక్రియామధ్యమునఁ బరమశాంతిసుఖ మనుభవించుచుఁ, బరమశాంతినడుమ నుద్దండక్రియాకరణ దక్షుఁ డగువాఁడు, జీవితరహస్య మెఱిఁగినవాఁడు." అని కదా గీత చెప్పుచున్నది. అది చేయుట యెట్లో కృష్ణుఁడు చూపుచున్నాఁడు—ఎట్లు? అసక్తుఁడవై యుండుటవలన— సర్వము చేయుము, కాని తాదాత్మ్యమునొంది యొకదానియం దును తగులువడకుము. నీవెప్పుడునుగూడ స్వచ్ఛమై స్వచ్ఛంద మైయుండు నాత్మవు, సాక్షిభూతుఁడవు. మనకు దుఃఖము ఆస క్తతవలనఁ గాని కర్మాచరణమువలనఁ గలుగదు. ధనమును దృష్టాంతముగాఁ దీసికొందము. ధనార్జనము గొప్పపనియే, డబ్బుసంపాదింపుము, సంపాదించుటకుఁ గావలయుపాట్లన్ని యుఁ బడుము, కాని దానియందుమాత్రము తగులువడకు ము—ఇట్లు శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు. ధనమెట్టిదో, బిడ్డలు, భార్య, భర్త, బంధువులు, యశస్సు, మున్నగునన్ని యును అట్టివే; నీవు వాని వర్జింపనక్కఱలేదు. దేనియందును సక్తుఁడవు మాత్రము కాఁగూడదు. సక్త కర్హమైనపదార్థ మొక్కటియే యున్నది. అది భగవత్ప్రీత్యర్థము, మఱొక టేదియును గాదు. దారపుత్రాదులకోసము ఎన్నిపాట్లయి నను బడుము, వారిని ప్రేమింపుము, వారికి మేలుచేయుము, వలయు నెడల నూఱుజన్మములు వారికి దారవోయుము, కాని

సంగబంధములోమాత్ర మెన్నఁడునుబడకుము. శ్రీకృష్ణునిచరిత్రమే యీయంతకును ళ్యమోఘనిదర్శనమై యున్నది.

శ్రీకృష్ణజీవితము నభివర్ణించుగ్రంథము పెక్కువేలసంవత్సరముల క్రిందటనే వ్రాయఁబడినది యనుమాట జ్ఞప్తిలోనుంచుకొనుఁడు. శ్రీకృష్ణచారిత్రభాగములుకొన్ని, నేజెకత్తునందలి జీజస్సుగారి చారిత్రములోని కొన్నిభాగములకు సరిగా నుండును. కృష్ణుఁడు రాచకుటుంబములోఁ బుట్టినాఁడు; చండశాసకుఁడును ప్రజాపీడకుఁడును అగుకంసుఁడనురాజొక్కఁ డుండెను, ఫలానాకుటుంబములోఁ బుట్టియొకఁడు రా జగునని యనాగతవిదులు చెప్పుచుండిరి. అందుచేతఁ గంసుఁడు పుట్టిన మగబిడ్డలనెల్లఁ జంపుఁడని యాజ్ఞయిచ్చెను. కృష్ణునితలిదండ్రులను గంసుఁడు చెఱ నుంపించెను; ఆకారాగృహములోనే శ్రీకృష్ణశిశువు జననమొందెను. అంతటఁ జెఱసాలలో నాకస్మికముగా నెకమహాతేజస్సు కాన్పించెను. "నేను లోకోపకారార్థము పుట్టిన జగజ్జ్యోతిని" అని యాపుట్టినబిడ్డ పల్కెను. ఇంతియకాక, గోవులతో నతఁడుండునట్లు శ్రీకృష్ణపటములో మీరు చూచుచున్నారు:—శ్రీకృష్ణుని "గొప్పగోపాలుఁ" డందురు. భగవంతుఁడే యట్లవతరించినాఁ డని చెప్పి మహాత్ము లాయన కభివందనములర్పించుటకు వెళ్ళినారు. మిగిలిన కథాభాగములలో నుభయములకు నేక విధసామ్యము గన్పట్టదు.

హిమాలయాభిముఖులై వెళ్ళిరి; ఈ పెద్ద ప్రయాణమునే *మహాప్రస్థాన మందురు. ఇది యొకవిధమైన సన్యాసము. వృద్ధ నృపతులు సన్యాసులగుట పూర్వాచారము. పూర్వకాలమున, హిందూదేశములోఁ గనువృద్ధులైనవారు, సర్వము పరిత్యజించెడివారు. రాజులును అట్లే చేసెడివారు. ఇంకను జీవింపవలయునను అపేక్ష లేనప్పుడు మనుష్యుఁడు, అన్నపానములు మాని, దేహపతనమగువఱకు, హిమవత్పర్వతముల వైపు నడచిపోవుచుండువాఁడు; శరీరముపడిపోవువఱకు సదా భగవద్ధ్యానము చేయుచు అట్లే కాలినడకను సాగిపోవుచుండువాఁడు.

దేవతలును ఋషులునువచ్చి నీవు స్వర్గమునకు వెళ్ళవలయు నని యుధిష్ఠిరునితోఁ జెప్పినారు. స్వర్గముచేరుటకు అత్యున్నతములైన హిమాలయశిఖరములు దాఁటిపోవలెను. హిమవత్పర్వతముల కవ్వల మేరుపర్వత మున్నది. మేరుశిఖరముమీఁద స్వర్గ మున్నది. అంతకుము న్నెవ్వరును బొందితో నటకుఁ బోలేదు. అది సురలు నివసించు చోటు. అక్కడ కేగవలయునని యిప్పుడు దేవతలు యుధిష్ఠిరున కానతి యిచ్చినారు.

అందుచేఁ బత్నీసహితులై పాండవసోదరు లైదుగు

*మహా=గొప్ప. ప్రస్థానము=ప  ణము.

రును వల్కలధారులై పయనమైనారు. మార్గమధ్యమం దొకకుక్క వచ్చి వారిని వెంబడించిపోవుచుండెను. అటు పోయి పోయి గమనపరిక్లాంతము లైన కాళ్లతో, సున్నతశిఖరములు గల హిమవత్పర్వతములందు నుత్తరదిశకు మరలి పోవుచుండఁగా, ఎదుట వారికి మహామేరునగ మగపడెను. మాటలాడకుండ మంచులోఁబడి వారు పోవుచుండఁగా, అకస్మాత్తుగా రాణిక్రిందఁబడి మరణించెను. "రాజా! యిటుచూడుము! రాణి పడిపోయినది" అని భీముఁడు ముందుపోవుచున్న యుధిష్ఠిరునితోఁ బల్కెను. రాజు కన్నీళ్ళు రాల్చి, వెనుకకుఁ దిరిగిచూడక "మనము శ్రీకృష్ణుని గలిసికొనఁబోవుచున్నాము. తిరిగిచూచుటకుఁ దెలుపిలేదు. సాగిరండు" అనెను. కొంతసేపుండి "అయ్యో! యిటు చూడుము! తమ్ముఁడు సహదేవుఁడు పడిపోయినాఁడు" అని మరల భీముఁడు కేకవేసెను. అది విని యశ్రువులురాల్చి "ఆఁగక సాగిరండు!" అని యుధిష్ఠిరుఁడు మాఱుపల్కెను.

ఇట్లు, యీ చలిలోను మంచులోను, ఒకరితరువాత నొకరు, మిగిలిన ముగ్గురుసోదరులును బడిపోయిరి; కాని యుధిష్ఠిరుఁడు చలింపక, రాజు ముందుకుఁ జొరఁబాఱి పోవుచుండెను. పోవుచు వెనుకకుఁ దిరిగిచూడఁగా, విశ్వాసపాత్రము కుక్క యొక్కటియే వెంటవచ్చుచున్నట్లు గాన్పించెను. రాజును కుక్కయును, మంచుమీఁదను గడ్డమంచు

మీఁదను నడచి, గిరులను దరులను దాఁటి, యున్నతోన్నతప్రదేశము లెక్కి యెక్కి, పోయి పోయి, చివరకు మేరుశిఖరిఁ జేరిరి; అప్పుడు వారికి దివ్యగానము వినఁబడ మొదలు పెట్టెను; పుణ్యాత్ముఁ డగురాజుపై దేవతలు దివ్యపుష్పవృష్టి గురిసిరి. అంతట దివ్యస్యందన మొకటి క్రింది కింద్రుఁడు దీసి కొనివచ్చి యుధిష్ఠిరు నిట్లు ప్రార్థించెను:—" మానవపుంగవా! మానవశరీరము మార్చుకొనకుండ స్వర్గములోఁ బ్రవేశించు ననన్యసామాన్య మైన యధికారము సంపాదించు కొన్న లోకైకమాన్యా! యావిమాన మెక్కుము." ఆమాట లాలించి యుధిష్ఠిరుఁడు—భ్రాతృభక్తియుక్తులగునాతమ్ములును నా రాణియుఁ దోడరాకుండ నే నక్కడికేఁగను జేయను—అని చెప్పెను. తనకు ముందే వారటకుఁ బోయియున్నారని యింద్రుఁడు విశదీకరించెను.

అంతట యుధిష్ఠిరుఁడు తిరిగిచూచి "బిడ్డా! విమాన మెక్కుము." అని తనకుక్కతోఁ జెప్పెను. ఆమాటల కింద్రుఁడు విస్మయాకులమనస్కుఁడై యిట్లనియెను:—"ఏమీ! కుక్క కూరుచుండుటయా? చీ! చీ! దానిని త్యజింపుము శ్వానము స్వర్గమునకుఁ బోలేదు. మహారాజా! నీయభిప్రాయ మేమి? నీకు పిచ్చియెత్తినదా? మనుష్యజాతిలో నెల్లఁ బుణ్యతముఁడవైన నీవు—నీవుమాత్రమే—సశరీరస్వర్గప్రాప్తికిఁ జాలినవాఁడవు."

యు—అయిననేమి? విశ్వాసపాత్రమగు ఈకుక్క మంచులో శ్రమపడి నడచి నాకుఁ దోడునీడయై యున్నది. నా సోదరులు గతించినారు, నారాణి పోయినది; కాని యిదిమాత్రము నన్నెప్పుడు విడిచిపోలేదు. నేనుమాత్రము దాని నిప్పు డెట్లు విడిచిపోఁగలను?

ఇం—మనుష్యులు కుక్కలతో స్వర్గమునకుఁ బోవుటకు వీలు పడదు. దానిని దిగవిడిచి పోవకతప్పదు. అది యధర్మము గాదు, దానిలో నన్యాయ మేమియు లేదు.

యు—ఈకుక్కకూడ రాకుండ నేను స్వర్గమునకు రాను. నాశరణుచొచ్చిన యిట్టిదానిని, నాప్రాణములు పోవువఱకు, నే నెన్నఁటికి విడనాడను. స్వర్గసుఖములు వచ్చు ననికాని, నన్ను దేవేంద్రుఁ డట్లు చేయుమని ప్రేరించుచున్నాఁడనికాని, నే నెప్పటికి న్యాయపథమునుండి యణుమాత్రమైనను దొలఁగిపోను.

ఇం—అట్లైన, నొకలాగున ఈకుక్క స్వర్గమునకుఁ బోఁగలదు. నీవు మనుష్యులలో నతిపుణ్యాత్ముఁడవు; జంతువులను జంపుకొని తినుచు, వేఁటాడి పరప్రాణిహింస యొనర్చుచు, ఈకుక్క బహుపాపములు చేసికొన్నది. నీస్వర్గము కుక్కకు వినిమయము చేయుపక్షమున, అది యచటకుఁ బోవచ్చును.

యు—మంచిదే! దానికి నే నొప్పుకొనినాను; ఈకుక్కను స్వర్గమునకుఁ బోనిండు.

అట్లనినవెంటనే దృశ్యవస్తువులలో మార్పు గలిగెను. యుధిష్ఠిరునియొక్క యీ యుదారవచనములు వినుటతోడనే, కుక్క ధర్మదేవతగా మారి చూపట్టెను; న్యాయాధిదేవతయు మరణాధిదేవతయు నగుయముఁడే కాని ఆకుక్కయన్యముకాదు. మహైశ్చర్యానందములతో ధర్ముఁ డిట్లు పల్కెను:—"రాజా! నీ స్వర్గసుఖమంతయు నీచమగునొక కుక్కకయి నిష్టపడినావు, దానికోసము నీసుకృతఫలమంతయుఁ గోల్పోయి నరకమునకుఁ బోవుటకుఁగూడ సిద్ధపడియుంటివి; నీవంటిస్వార్థత్యాగి మానవజాతిలో నెవఁడును లేఁడు. రాజాధిరాజా! జన్మమన్న నీదేజన్మము. భారతర్షభా! నీవు సర్వభూతదయాళుఁడవు; అట్టిదివ్యభూతదయాతరత్వమున కిది యొక దేదీప్యమానమైన దృష్టాంతము. కావున అక్షయానందపదము లన్నియు నీవి! రాజా! వానిని నీవు గెలిచి సంపాదించుకొన్నావు; నీగమ్యస్థానము దివ్యము నత్యున్నతము నైన స్థానము."

అంతట ధర్మేంద్రాదిదేవతలతో, యుధిష్ఠిరుఁడు విమానమెక్కి స్వర్గమున కేగెను. కొన్నిశోధనక్రియలు జరిగినతరువాత నతఁడు స్వర్ణదిలో స్నానముచేసి దివ్యదేహము

ను బడసి దేవతారూపములతో నున్న తనతమ్ములను గలసికొనెను—అంతయు నానందములోఁ బరిసమాప్తి నొందెను.

మహాభారతకథ యీప్రకారము ముగిసినది. ఈప్రౌఢమైన పద్యకావ్యములో ధర్మముయొక్క విజయమును అధర్మముయొక్క పరాజయమును ప్రశస్తముగా వర్ణింపఁబడినవి. మహాభారతముఁగూర్చి మీతోఁ గొంచెము మాటలాడితిని. అంతేకాని అప్రతిమానధీశక్తియుక్తుఁడగు వ్యాసమహర్షి వర్ణించిన యనంతమహాశూరశ్రేణియొక్క యుజ్జ్వలోదారప్రకృతు లన్నియుఁ బ్రదర్శించుట నాకుఁ గేవల మసాధ్యము. భగవద్భీతి గలవాఁడయ్యును దుర్బలుఁడై వృద్ధుఁడై యంధుఁడై పడియున్న ధృతరాష్ట్రనృపాలుని హృదయములో న్యాయ్యప్రవృత్తికిని బుత్రవాత్సల్యమోహములకును జరుగుచుండిన యంతఃకలహములు; పితామహుఁడగు భీష్మునియొక్క యుత్తుంగ సౌశీల్యము; ధర్మరాజుయొక్క యుదారధర్మస్వభావము; బలపరాక్రమములలో నెంతగొప్పవారో భ్రాతృభక్తి రాజభక్తులలోను అంతగొప్పవారే యైన యాతని నలుగురుతమ్ములయొక్క యుదారసత్ప్రకృతి; అసమానమేధాసంపన్నుఁడగు శ్రీకృష్ణుని యనన్యసామాన్య తేజస్వంత మగుశీలము—ఇట్టివిషయము లందభివర్ణింపఁబడినవి. అవిగాక, గంభీరహృదయయగు గాంధారిరాణి, మాత్రనురాగమహావధి యగుకుంతి, సదా పతిసేవానిరతయు, సంతత

దుఃఖభాజనుఁ డగుఁ డౌపది——మున్నగు మహాస్త్రీల లక్షణములును .అందుఁ జిత్రితములై యున్నవి; ఈస్త్రీలక్షణములు మహాపురుషులలక్షణములకంటె నిసుమంతయుఁ దక్కువ ప్రభావంతములు గావు. ఇట్టిసుశీలురును సుశీలలును, ఈ యితిహాసమందును రామాయణమందును, నూర్లకొలఁది నున్నారు. గతించిన యనేకసహస్రవర్షములనుండి వారి సచ్చరిత్రము, హైందవమండలికంతకును, అమూల్యపరంపరాగత పైతృకధనముగా వచ్చుచున్నది; వారి పారమార్థికచింతలకును ధార్మికభావములకును నీతికిని అదియే యాధారమై యున్నది. ఇంతయేల ? రామాయణ మహాభారతములు రెండును, యావత్ప్రాచీనార్యమనీషాచారిత్రములను ఒకచోట సంగ్రహించి పెట్టిన జ్ఞానపుభాండాగారము లని చెప్పవచ్చును; ఆదర్శభూత మైనశిష్టత్వమును నాగరకతయును అందుఁ జక్కఁగా వర్ణింపఁబడియున్నవి; అట్టి నాగరకత కభిలాషపడి దానిని సంపాదించుకొనుట కిప్పటిమనుష్యుఁడింకను బయలు దేరవలెను.



శ్రీరామచంద్రా!

(కాలిఫర్నియాలో నిచ్చిన యుపన్యాసము)

# జడభరతుని కథ

పూర్వము భరతుఁ డనునొకగొప్పరాజుండెను. విదేశీయులు హిందూదేశ మనుదానినే తద్దేశపుత్రులు భారతవర్ష మందురు. హైందవుఁడగు ప్రతివాఁడును, ముసలితనము రాఁగానే, ప్రపంచవ్యాపారము లన్నియు మానుకొని—ఐహికసంబంధమైన చింతలు, ధనము, సుఖము, భోగములు, తన కొడుకునకు విడిచిపెట్టి—తనలోని యేకసత్యతత్వ మైనయాత్మను గూర్చి విచారణ చేసికొని, తన్మూలమున భవబంధము లన్నియుఁ ద్రెంపుకొని విముక్తుఁ డగుటకుఁ, గానల కేగవలయు నని శాస్త్రములందు విధింపఁబడియున్నది. భూపతియైనను సరే పురోహితుఁడైననుసరే, సేద్యకాఁడైననుసరే సేవకుఁడైననుసరే, పురుషుఁడైననుసరే పొలఁతియైననుసరే—అందఱును అట్లుచేయక తప్పదు. సోదరుఁడు, సోదరి, కొడుకు, కూఁతురు, భర్త, భార్య, తండ్రి, తల్లి—వీరందఱును ఆచరించు గృహస్థధర్మములన్నియు ఆయాశ్రమమున కర్తవ్యాలుగాఁ జేసికొనుట కుపయోగించు సాధనములు, పూర్వాభ్యాస

ములు; ఆమాశ్రమములో, ఆత్మను దేహమున కంటఁగట్టి యుంచు పాశములన్నియుఁ బూర్తిగా, మఱియెన్నఁటికి రాకుండఁ, దెగి పడిపోవును.

మన భరతమహారాజు, తనవార్ధకములోఁ, దన రాజ్యము కొడుకున కప్పగించి, యడవికిఁ బోయెను. అనేక కోట్లప్రజలను బరిపాలించి, బంగారుతోను వెండితోను పాల రాలతోను గట్టిన దివ్యభవనములలో నివసించి, రత్నఖచిత ములైనపానపాత్రిలతోఁ ద్రాగుట కలవాటు పడిన యీరా జు, హిమాలయవిపినములలో నొక నదీతీరమున, తెల్లును గడ్డియును ఏఱి తెచ్చుకొని, స్వహస్తములతో నొక చిన్నకుటీర మేర్పఱుచుకొని, స్వయముగా సంగ్రహించి తెచ్చుకొన్నదుం పలను ఇతరారణ్యశాకపదార్థములును దినుచు నందుండి, సదా హృదయాంతరస్థుఁడై యుండు పరమాత్మ నెల్లప్పుడు ధ్యానిం చుకొనుచు, నుండెను. దినములు, నెలలు, సంవత్సరములు, అట్లు గతించెను. ఒకరోజున, రాజర్షి భగవధ్యానము చేసి కొనుచుండుచోటికి, నీళ్లుత్రాగుటకై యొక యాఁడులేడి వ చ్చెను. అప్పుడే యనతిదూరమునుండి వచ్చు యొకసింహగర్జ నము దానికి వినఁబడెను. లేడి మిక్కిలి భయపడి, దగఁదీర్చు కొనకుండనే, యాయేఱు దాఁటి పాఱిపోవుటకై యొకపెద్ద దూఁకు దూఁకెను. చూలుకొనియున్న యాలేడి పాప! మా కస్మికముగాఁ గలిగినభీతిచేతను, దుముకుటకై చేసిన యత్నిక

ప్రయత్నపూర్వకమైన ప్రయాసముచేతను, ఒకపిల్లను గని తోడనే మరణించెను. ఆపిల్ల, నీరుగులు గ్రక్కుచుఁ బ్రవహించు ఆయేటినీటిలోఁ బడి కొట్టుకొనిపోవుచుండెను; అది మన రాజుకంటఁ బడెను. తత్క్షణమే యతఁడు తపస్సునుండి లేచి, నీళ్లనుండి లేడిపిల్లను దీసి, తన యుటజమునకుఁ గొనిపోయి, నిప్పుచేసి, కాఁచి, శ్రద్ధతో సకలోపచారములు చేసి, బుజ్జగించి, దానికి మరలఁ బ్రాణములుదెచ్చెను; తెచ్చి దయార్ద్రహృదయుఁడై దానిఁ దనపోషణములోఁ బెట్టుకొని లేఁ బచ్చికయుఁ బండ్లనుబెట్టి పెంచెను. వానప్రస్థుఁడైన రాజపితసంరక్షణమున ఆపిల్ల పెరిఁగి క్రమముగా నొకపరమసుందరమైన లేడి యయ్యెను. యావజ్జీవానుబంధములై యున్నకుటుంబానురాగమును రాజ్యాధికారకాంక్షలును ఇట్లే చంపుకొని రాఁ గలిగిన మనోబలశాలి, తా నేటినుండి రక్షించిన లేడియొక్క యనురాగపాశములలోఁ దగులుకొనెను. కురంగముపై ప్రేమ యతిశయించినకొలఁదిని, ఏకాగ్రతతో నీశ్వరుని ధ్యానించు నాంతరంగశక్తి తగ్గిపోవుచుండెను. లేడి మేఁత కడవికి వెళ్ళి యింటికి మరల వచ్చుటలో నించుక యాలస్యము చేసినయెడల, రాజర్షి మనస్సు వ్యాకులత నంది బాధపడుచుండెను. "నాముద్దుబిడ్డపై నేపెద్దపులియో పడెనేమో! మఱి యే యుపాయమైన తటస్థించెనేమో! అట్లేకానిచో అది వేళ

కింటికి రాతుంచుట యెట్లు సంభవించును ?" అని యుల్లము
త్రూంత లూంగుచుండెను.

కొన్ని సంవత్సరము లిట్లు గతించెను. అంతట నతని
మరణదినము వచ్చెను; రాజర్షి క్రిందం బరుండి యూర్ధ్వశ్వా
సము లూర్చుచుండెను. ఆత్మనిష్ఠమై యుండవలయుచిత్త మా
లేడినే తలంపోయుచు నుత్తలపడుచుండెను; తుదకు దృష్టి తన
ముద్దుల లేడి విషణ్ణవీక్షణములపైం బెట్టుకొని యతండు ప్రాణ
ములు విడిచెను. అందుచే నతండు తరువాతిజన్మమున లేడియై
పుట్టెను. అయినను, చేసినకర్మ మెన్నండికిని వ్యర్థగాం బోదు;
రాజుగాను వానప్రస్థుండుగాను నున్నప్పుడు తాం జేసికొన్న
మహాసత్క్రియలెల్లను వాని సత్ఫలము లొసంగెను. మృగదే
హాము దాల్చి మాటలాడలేకున్నను అతండు పూర్వజన్మజ్ఞాన
ము గలిగి జాతిస్మరుండై యుండెను. పూర్వజన్మవాసనాబల
మునం, దనతోడిలేళ్ళ సాంగత్యము మాని, సదా హోమా
ములు చేయుచు ఉపనిషత్తులు బోధించుచు నుండు ఋష్యా
శ్రమములకడ మేయుట కతండు పోవుచుండెను.

సాధారణముగా లేళ్ళు జీవించుకాలము గడచినపిమ్మట,
నతండు మరణించి, తరువాత ధనవంతుండగు నొక బ్రాహ్మ
ణుని కడపటికొడుకుగాం బుట్టెను. ఆజన్మములోంగూడ నత
నికిం బూర్వజన్మస్మృతియుండెను; శిశువుగా నున్నప్పుడే "సం
సారసంబంధ మైన మంచిచెడ్డలలో—పుణ్యపాపములలో—

నే నింకఁ జిక్కుపడను" అని యతఁడు దృఢనిశ్చయము చేసి కొనెను. బిడ్డ పెరిఁగి బలారోగ్యములు గలవాఁడగుచువాఁ డయ్యెను; కాని నైహికవిషయలంపటుఁడ నగుదునను భయము చేత, నించుకయు మాటాడక యతఁ డొకజడునివలె, పిచ్చివానివలెఁ, దిరుగుచుండెను; అనవరతము ఆయమేయతత్వము పైనే మన సుంచుకొని పారిబ్ధక్షయముకై ప్రతీక్షించుచు నందుకొఱకే జీవించియుండెను. కొంతకాలమునకుఁ దండ్రి మరణించెను; కొడుకు లాస్తి పంచుకొనిరి; కడగొట్టునతమ్ముఁడు మూఁగవాఁడు, వట్టి యప్రయోజకుఁ డని యెంచి యతనివంతుగూడ నన్నలు దామే యన్యాయముగా పుచ్చుకొనిరి కాని, దయదలఁచి, ప్రాణధారణమునకుమాత్రము గావలయు ఆహార మతనికిఁ బెట్టుచుండిరి; అన్నలభార్యలు తఱచుగా నతనియెడల నతిక్రూరలై ప్రవర్తించుచుండిరి; కఠినమైన పనులన్నియు నతనిపైఁ బెట్టి, చేయుమన్నదెల్ల నతఁడు చేయలేకున్న, నిర్దయురాండ్రై దౌర్జన్యము చూపి యతని బాధించి యవమానించుచుండిరి. ఏమి చేసినను, చిరాకు లేదు! భయము లేదు! ఒకమాటయైనను ఆఁటలేదు! పెట్టుబాధ దుర్భరమైనయెడల, నతఁ డిల్లు వదలిపోయి, వదినెలకోపము శాంతించువఱకు ఏచెట్టుక్రిందనో కొంతసేపు గూరుచుండి, పిమ్మట నెమ్మదిగా మరల నిల్లు చేసుకొనెడువాఁడు.

ఒకరోజున, వదినెలు తనకు సాధారణముగాఁ జూపు

క్రౌర్యముకంటె నధికక్రౌర్యము చూపుటచే, భరతుఁడిల్లు విడిచిపోయి యొకచెట్టునీడను గూరుచుండి విశ్రాంతి గొనుచుండెను. బోయీలు బుజములపైఁ బెట్టుకొని మోసికొనిపోవుచుండు పల్లకీలోఁ గూరుచుండి ఆదేశపురాజప్పుడే యాపరిక్క నుండి పోవుచుండెను. పల్లకిమోయు బెస్తలలో నొకనికి ఆకస్మికముగా జబ్బుచేసెను; వానికిబదులుగా సవారిమోయుటకెవఁడైన దొరకునేమోయని రాజభృత్యులు వెదకుచుండిరి. వారికి చెట్టుక్రిందనున్న భరతుఁడు గానిపించెను; వ్యాధిగ్రస్తుఁడై పడిపోయిన బెస్తకు మాఱుగా రాజుగారిసవారి నీవు మోయుదువా యని, బలవంతుఁడుగాను పడుచువాఁడుగాను అగపడుచున్న ఆభరతుని వారడిగిరి. కాని దానికతఁ డుత్తరమేమియు నీయలేదు. అంతట దృఢకాయుఁడుగా నున్నయతనిని రాజభటులు పట్టుకొని తీసికొనిపోయి బలవంతముగా పల్లకికొమ్మతనిబుజముపైఁ బెట్టిరి. ఇదేమియని మాట యొక్కటేని యాడకుండ భరతుఁడు సవారిమోసికొనిపోవుచుండెను. ఇంచుకసేపటికే, రాజు, సవారి సరిగా మోసికొని పోవుటలేదని చెప్పి, యందుండి బయటికిఁ జూచి క్రొత్తబోయీతో నిట్లు పల్కెను—"ఓరీ! మూర్ఖా! ఉండుముండుము! నీబుజములు నొప్పిపెట్టుచున్నయెడల, ఆఁగి కొంచెము శ్రమ తీర్చుకొనరాదా?" అంతట సవారిబొంగు క్రిందికి దింపి, భరతుఁడు, (తనజీవితములో ప్రథానముదరి) నీపాట కిదియే

తొలిసారి.) పెదవులు తెఱచి యిట్లు ప్రత్యుత్తర మిచ్చె ను:—'' రాజా ! యెవనిని నీవు మూర్ఖుఁ డనుచున్నావు ? సవారి దింపుకొనుమని యెవనితోఁ జెప్పుచున్నావు ? ఎవఁ డలసట పడినాఁడనుచున్నావు ? నీవునీవని నీ వెవనిసంబోధిం చుచున్నావు ? రాజా ! 'నీవు' అనుటలో నీచే నుద్దేశింపఁ బడినది యీమాంసపుముద్దయే యగునెడల, నీశరీరములో నేమున్నవో నాశరీరములోను అవియే యున్నవి. వానికి చైతన్యము లేదు; అది శ్రమముగాని బాధగాని యెఱుఁగదు. నీ వుద్దేశించినది మన స్సందువేని, నీమనస్సును నామనస్సును ఒకటియే, అది సార్వత్రికమై యున్నది. ఇఁక 'నీవు' అను నది దాని కవ్వలనున్నది యని నీయభిప్రాయమగునెడల, అది యే ఆత్మ, నాలోను నీలోను అన్నిటిలోను ఉన్నసత్యత త్త్వము, విశ్వమందంతట నున్నదదియొక్కటియే. ఆత్మ యెన్నఁ డైన ఆయాసపడి, అలసటనొంది హింసపడునని నీ వనుకొను చున్నావా ? రాజా ! నేను—ఈశరీరము—ఏపాప మెఱుఁగక త్రోవలోఁ బ్రాఁకిపోవుచుండు క్రిమికీటకాదులను ద్రొక్కి, చంప నిచ్ఛగింపక వానిని దప్పుకొని నడవఁ బ్రయత్నించు టచే నీపల్లకికి విషమచలనము గలిగినది. అంతేకాని యాత్మ యెప్పుడును ఆయాసపడలేదు, అదెప్పుడును దుర్బలమై యుండ లేదు, అ దెన్నఁడును నీసవారిబొంగు బుజానఁ బెట్టుకొని మోయ లేదు—అది సర్వవ్యాపి, సర్వశక్తియుక్తమైన తత్త్వము. ''

ఈ ప్రకారముగా, భరతుఁ డసమానవక్తృత్వముతో, ఆత్మ తత్వము, ఉత్తమజ్ఞానము, మున్నగుమహావిషయములఁ గూర్చి యుపన్యసించెను. అంతటఁ దనయంతపండితుఁడును తత్వజ్ఞాని యు నెవఁడు లేఁ డని యంతవఱకు నతిగర్వముతో నున్నరాజు పల్లకీ దిగి భరతునిపాదములపైఁ బడి "మహాత్మా! నన్ను క్షమింపవలెను; నన్ను మోసికొనిపొమ్మని నే నీతోఁ జెప్పి నప్పుడు, నీవు మహానుభావుఁడవైన తత్వవేత్త వని నాకుఁ దెలి యదు" అని ప్రార్థించెను. భరతుఁడు రాజు నాశీర్వదించి పోయి మరల యథాపూర్వముగా నిస్సంగుఁడై, సుఖదుఃఖము లయందు సమచిత్తుఁడై, జీవయాత్ర సాగించుకొనెను. దేహ మును విడువఁగానే, యాయన, శాశ్వతభవబంధవిముక్తి నొం దెను.

---

శ్రీరామచంద్రా!

# ప్రహ్లాదుని కథ.



(కాలిఫర్నియాలో నిచ్చిన యుపన్యాసము.)

హిరణ్యకశిపుఁ డను దైత్యరాజొకఁడు గలఁడు. దైత్యులును దేవతలును ఒక్కతండ్రిబిడ్డలును ఒక్కవంశమువారును నైనను, ఒండొరులతో నెప్పుడు పోరాడుకొనుచుండిరి. దైత్యులకు మనుష్యులు చేయు యాగాదులలో హవిర్భాగములులేవు; ప్రపంచమును పాలించినడపుటలో పాలును లేదు. అయినప్పటికిని, ఒకొక్కప్పుడు వారు బలవంతులై స్వర్గమునుండి దేవతలను తఱిమివేసి, దేవతాసింహాసనమాక్రమించి కొంతకాలము పరిపాలనకృత్యము చేయుచుండిరి. అప్పుడు దేవతలు, సర్వవ్యాపకుఁడును సర్వప్రపంచమునకుఁ బ్రభువును అగు విష్ణునొద్దకు వెళ్లి మొఱ్ఱపెట్టుకొనఁగా, నతఁడు తోడుపడి వారి నాయాపదలనుండి తొలఁగించెడువాఁడు. అంతట దైత్యులు పలాయితు లయ్యెడువారు, దేవతలు మరల వారిరాజ్యము వారేలుకొనెడు వారు. అట్లే తనకాలములో, దైత్యప్రభు వగు హిరణ్యకశిపుఁడు, తనజ్ఞాతు లగుసురలను జయించి, స్వర్గసింహాసన మధిష్ఠించి—మనుష్యులును జంతువులును నుండు మర్త్యలోకమును, సురలును సురతుల్యులును

నుండు నూర్ధ్వ (స్వర్గ) లోకమును, దైత్యులుండు నధో(పా తాళ)లోకమును—ముల్లోకములను బరిపాలించుచుఁ, దానే సర్వప్రపంచనాథుఁ డగుదేవుఁ డనియుఁ, దాఁ దప్ప నితరుఁ డగుదేవుఁ డెవఁడును లేఁ డనియుఁ, జాటించి చెప్పి, యొక్క డను ఎవ్వఁడును సర్వశక్తుఁ డని చెప్పఁబడు విష్ణునిఁ బూజింపఁ గూడదనియు, ఆయన్నిపూజలును దనకొక్కనికే చేయవల యు ననియుఁ, గఠినమైన యుత్తరువు లిచ్చెను.

ఆహిరణ్యకశిపునకు ప్రహ్లాదుఁ డను నొకకుమారుఁడు గలఁడు. అతఁడు శైశవము నుండియు భగవద్భక్తుఁడై యుండుట తటస్థించెనుగాన, నతిబాల్యమునందే భక్తిసూచన లతఁడగపఱుచుచుండెను. దైత్యరాజగుతండ్రి దీనిఁగనిపట్టి, యేయనర్థమును దాఁ బ్రపంచమునుండి తొలఁగింపఁదలఁచు కొన్నాఁడో, అది తనకుటుంబములోనే యావిర్భవించి యభి వృద్ధి నొందు నని భయపడి, చండుఁడు అమార్కుఁడు అను నతికఠినశిక్షకులగు నిరువురు గురువులకుఁ దనకొడుకు నప్ప గించి —విష్ణునామము సైతము ప్రహ్లాదుని విననీయఁగూడ దు—అని చండశాసనములు చేసెను. అంతట నుపాధ్యాయు లతనిని దమయింటికిఁ గొనిపోయి, సవయస్కు లగునితరబాల కులతోఁ జదివింపఁజొచ్చిరి. కాని ప్రహ్లాదబాలకుఁడు పుస్తక ములు తెఱచి పాఠములు చదువుకొనుటకుమాఱుగా, విష్ణు నెట్లుభజింపవలెనో యితరబాలుర కుపదేశించుటలో కాల

మంతయు విఫలమగపఱచెను. అది గనుంగొని, చండశాసనుఁడగు హిరణ్యకశిపునకుఁ గోపము వచ్చునను భయముచే గురువులు వడఁకుచు, అట్టిబోధనములు గావింపకుండ బిడ్డను మరలించుటకుఁ దమయావచ్ఛక్తియు నుపయోగించి ప్రయత్నించిరి. ప్రయత్నించిన నేమి? తనయుచ్ఛ్వాసనిశ్వాసము లాఁపుకొనుట యెంతయసాధ్యమో, విష్ణుసేవయు విష్ణుభక్త్యుపదేశములును మానుకొనుట ప్రహ్లాదున కంతయసాధ్యమయ్యెను. తమయందు దోషము లేదనిపించుకొనుటకు, వెంటనే గురువులు రాజునొద్దకు వెళ్లి, తా విష్ణువును బూజించుటయేకాక ప్రహ్లాదుఁడు విష్ణుభక్తి నుపదేశించి యితరబాలుర నందఱినుగూడఁ జెఱుపివేయుచున్నాఁడను భీకరవార్త విన్నవించుకొనిరి.

రాజామాటలువిని మహాక్రోధభరితమనస్కుఁడై, బాలుని తనకడకు రావించి, మృదువచనములతో నతని విష్ణుభక్తి విముఖుని జేయఁ బ్రయత్నించి, ప్రభువైన తానొక్కఁడే పూజార్హుఁడగుభగవంతుఁ డని బోధించెను. చేసినబోధనమంతయు నిష్ప్రయోజన మయ్యెను. "నాయనా! సర్వాంతర్యామియు సర్వప్రపంచాధిపతియు నగు విష్ణు వొక్కఁడే పూజార్హుఁడు; ఏలన, రాజవైన నీవుసైతము ఆయన కృపామహిమచేతనే ఈ సింహాసనము నిలుపుకొనఁజాలియున్నావు" అని బాలుఁడు నొక్కినొక్కి పెక్కుసారులు చెప్పెను.

అందులకు రాజపరిమితమైనకోపముచే మండిపడుచుం దక్షణమే యీకుత్సితవానిని సంహరింపుం డని యాజ్ఞాపించెను. అంతట దైత్యులా బాలకుని బాకులతోం బొడిచిరి; కాని, ప్రహ్లాదుని చిత్తము విష్ణువునందు లగ్నమైయుండుటచేత బాకు పోట్లబాధ యతని కేమియు నంటలేదు.

తండ్రి యదిగాంచి యతిభీతుం డయ్యెను; అయినను వెంటనే దైత్యప్రకృతి కనుగుణము లైనక్రూరమనోవికారములు జనించుటచే, బాలకుని దోరించుటకు నానాపరమదుష్టోపాయములును పన్నెను. అతనిని ఏనుంగుకాలిక్రిందం బెట్టి త్రొక్కింపుం డని యానతిచ్చెను; కాని కుపితగజము కాలికి ప్రహ్లాదునికోమలశరీర మొక పెద్ద అయోమయవిగ్రహమయ్యెను; కనుక ఆప్రియత్నము గూడ నిష్ఫల మయ్యెను. తరువాత రాజతనికి భృగుపాతదండనము విధించెను; ఉన్నత పర్వత శిఖరమునుండి బాలకుని క్రిందికిం బడంద్రోసిరి. త్రోసిననేమి ? ప్రహ్లాదుని హృదయమందు వెలుంగుచు విష్ణు వుండుటచే, పూవు పూరిపై నెట్లుపడునో యతం డవనిపై నంతనిరపాయముగాం బడెను. పిమ్మట విషము మ్రింగించినాండు, అగ్నిలోం ద్రోయించినాండు, నూతిలోం బడవేయించినాండు, పస్తుపెట్టినాండు, మంత్రప్రేషిత మహాశక్తులపాలు చేసినాండు, ఇతరసాధనము లెన్నెన్నియో నొకటి తరువాత నొకటిప్రయోగించినాండు—అన్నియు వ్యర్థములైపోయెను; అందొకటియు

నతని కించుకంతహానియైనను జేయలేకపోయెను. ఎందుచేత ? అతని నిర్మలహృదయములో శ్రీమహావిష్ణువు నెలకొనియుండుటచేత !

తుట్టతుదకు రా జొకయమోఘ దుర్దండనము విధించెను:—పాతాళలోకమునుండి రప్పించిన పెద్దపాములతో బాలకుని బంధించి, సముద్రముయొక్క యడుగునఁ బడవేసి, మీఁదఁ బెద్దపెద్దపర్వతము లొకదానిపై నొకటి పేర్చి యట్టె పెట్టుఁడు; వెంటనే కాకపోయినను, కాలక్రమమున వాఁడు చచ్చును—అని యాజ్ఞాపించెను. ఆప్రకారము చేసినప్పటికిని ప్రహ్లాదుఁడు భయపడక " సర్వాంగసుందరా ! అఖిలలోకాధినాథా ! విష్ణుదేవా ! సదా నీకు నా సాష్టాంగనమస్కారములు ! " అని ధ్యానించుకొనుచుండుటచే, విష్ణువు చెంతనున్నట్లే, తనయాత్మలోఁ దూఱి కూర్చుండినట్లే, యతని కగపడెను; అంతియకాక తాదాత్మ్యము నొంది తా విష్ణువేయై, సర్వత్ర తా నుండి, సర్వము తానే యైనట్లుకూడఁ దోఁచెను.

ఆమహత్తమ మైన యాత్మానుభవము కలుగఁగానే నాగబంధములన్నియుఁ దెగిపోయినవి; పర్వతరాసులు పొడిపొడియై పడిపోయినవి; సముద్రము లేచి, యణుమాత్రము కందకుండ నతని నలలపై నెత్తి తెచ్చి నెమ్మదిగా నొడ్డునఁ బెట్టెను. అప్పు, డాస్థితిలో, ప్రహ్లాదుఁడు తాను దైత్యుఁడన్నమాటయుఁ దా మర్త్యశరీరుఁ డన్నమాటయుఁగూడ మఱ

చిపోయెను. "సర్వప్రపంచము నేనే! సర్వప్రపంచశక్తు
లును నాలోనుండియే పు[illegible]ములో[illegible] బాధింపఁ
గలవస్తు వేదియు లేదు; [illegible]ర్వ్యాప[illegible]బాధిపలిసి" అనుకొ
నునట్టి యనిర్వాచ్యమైన [illegible] యతనికిఁ గలిగెను.
ఆయఖండబ్రహ్మానందానుభూతి[illegible] గొంతసేపున పిమ్మటఁ
దా నొకశరీరధారి, తాను ప్రహ్లాదుఁడు—అను స్మృతి క్రమ
ముగా రాఁదొడఁగెను. శరీరస్మృతి మరలఁ గలిగినవెంటనే,
లోపలను బైని భగవంతుఁడు వ్యాపించి యున్నట్లును,
సర్వము విష్ణుమయ మైనట్లును అతని కగపడెను.

తనశత్రు వగు విష్ణుదేవునియెడల సంపూర్ణభక్తి గల
చిన్నికొడుకును సంహరించుట కుపయోగించిన దారుణసాధన
ములన్నియు విఫలములగుటచూచి, హిరణ్యకశిపుఁడు భయ
కంపితుఁడై యేమిచేయుటకును దోఁపకయుండెను. రాజు తన
యుని దనయెదుటికి మరల రప్పించి, బుజ్జగించి, తనమాట
వినుమని సామవాక్యములతో, మఱియొకమాఱు బోధించెను.
కాని ప్రహ్లాదుఁడు వెనుక నిచ్చిన జవాబే యిప్పుడును
ఇచ్చెను. వయోవిద్యలు వచ్చుకొలఁదిని, ఈబాల్యచాపల్య
మంతయు, ఈమంకుతన మంతయుఁ, బోవు నను భ్రాంతితో,
రాజనీతియు రాజధర్మములును ఉపదేశింపుఁ డనిచెప్పి,
మరల నతనినిచండామార్కుల కొప్పగించెను. వారి యుపదే
శములు ప్రహ్లాదునకు రుచింపకపోవుటచేత, నతఁడు సహో

ధ్యాయులకు విష్ణుభక్తిమార్గముఁ గఱపుచు కాలముఁ గడ పెను.

అది యతనితండ్రి విని, క్రోధోన్మాదకారియై యా పిల్లవానిఁ బిలిచి, యనరానిమాటలతో విష్ణుదేవుని దూషించి "నిన్నుఁ జంపెద" నని భయపెట్టెను. దానికి బదులు ప్రహ్లాదుఁడు యథాపూర్వముగా, విష్ణుఁడే సర్వప్రపంచమునకుఁ బ్రభుఁ డనియు, ఆయన ఆద్యంతరహితుఁడును సర్వవ్యాపియు సర్వశక్తుఁడును అనియుఁ, గావున ఆయనయొక్కఁడే పూజింపఁదగినవాఁ డనియు, మరలఁ జెప్పెను. ఆమాటలవలనఁ గలిగిన కోపోద్రేక మాఁపుకొనలేక యొక సింహగర్జనము చేసి "ఓరీ! దుష్టబాలకా! నీవిష్ణువు గిష్ణువు సర్వవ్యాపకుఁ డైనభగవంతుఁ డేయగునెడల, ఆస్తంభములో లేఁడేమి?" యని యటనుండు నొకస్తంభముఁ జూపి పలికెను. "లేకేమి నాయనా! ఉన్నాఁ"డని ప్రహ్లాదుఁడు సవినయముగ జవాబు చెప్పెను. "ఉన్నచో నిన్నుఁ గాచుకొను మని చెప్పుకొనుము; ఈకత్తితో నిన్నిప్పుడే చంపెదను" అని రాజు, చేత నొకకత్తిఁ బట్టుకొని పరుగుపరుగునఁ బ్రహ్లాదునిమీఁదికిఁ బోయి దానితో స్తంభముపై నొకభయంకరమైనవ్రేటు వేసెను. తత్క్షణమే యురుమువంటి యొకపెద్దబొబ్బ వినఁబడెను; సగము నరశరీరము సగము సింహదేహము గల భీకరనృసింహరూపముతో విష్ణు హాస్తం

భముఁ బగుల్చుకొని పైకి వచ్చి ప్రత్యక్షమయ్యెను. అది చూచి యాకస్మికభయగ్రస్తులై, దైత్యులందఱు, నల్దెసలకుఁ జెల్లాచెదరై పాఱిపోయిరి; హిరణ్యకశిపుఁడుమాత్రము నిలఁబడి చావు సరకుసేయక సాహసించి ఆయనతో నెంతో సేపత్యుగ్రయుద్ధము చేసి, తుదకు నిర్జితుఁడై హతుఁడయ్యెను.

అంతట దేవతలు దివినుండి దిగివచ్చి విష్ణువును స్తుతించిరి; ప్రహ్లాదుఁడుకూడ ఆయనపాదములపైఁ బడి పరమభక్తిభరితములై ప్రశస్తములైన ప్రార్థనలు గావించెను. అంతట "ప్రహ్లాదా! నీకుఁగావలయున దేదియైనను అడుగుము! నీవు నాముద్దుబిడ్డవుగావున నీకభీష్టమైన దెద్దియైనను గోరు మిచ్చెదను" అని భగవంతుఁడు పలికెను. "మహాప్రభూ! నిన్ను దర్శించి ధన్యుఁడనైననాకు నింకేమికావలయును? తండ్రీ! దయయుంచి నాకు విషయసుఖలోభముఁ బుట్టింపకుము. భూలోకసౌఖ్యములును స్వర్గసుఖములును నాకక్కఱలేదు." అని భక్త్యుద్రేకప్రతిరుద్ధకంఠుఁడై ప్రహ్లాదుఁడు పలుకలేక పలుకలేక పలికెను. "అయినప్పటికిని, బిడ్డా! నీ వేదేని యడుగక తప్పదు." అను భగవద్వాణి మరల వినఁబడెను. ప్రహ్లాదుఁడిట్లు ప్రార్థించెను:—"ప్రభూ! పామరులకుఁ బ్రాపంచవిషయములపై నెట్టిప్రబలప్రీతి యుండునో నీపై నాకట్టితీవ్రవాంఛ యుండునట్లనుగ్రహింపుము! ప్రతిఫలాపేక్ష యుంచు

కయు లేకుండఁ గేవలపేరమార్థమే, నీపై నాకట్టిగాఢప్రేమ యుండుట నట్లనుగ్రహింపుము.''

అంతట భగవంతుఁ డిట్లు పల్కెను:—"నాయం దత్యంతభక్తిగలవా రైహికానందములుగాని యాముష్మికా నందములుగాని కోరుకొనరు; ఆమాట నిజమే! కాని నాయా జ్ఞప్రకారము నీ విట్లు చేయుము—ఈకల్పాంతమువఱకుఁ బ్రా పంచసుఖములనుభవింపుము, నాపైనీమనసు స్థిరముగానిల్పి పుణ్యకర్మములు చేయుము—ఆప్రకారము ప్రవర్తించిన నో యుక్తకాలమున, దేహత్యాగముచేసి, సాయుజ్యముక్తిద్వార మున నన్నుఁ దప్పక ప్రాపింతువు.'' ఇట్లు ప్రహ్లాదుని దీవించి విష్ణుదేవుఁ డంతర్హితుఁ డయ్యెను. బ్రహ్మాదిదేవతలందఱుఁ బ్రహ్లాదుని పట్టాభిషిక్తునిఁ జేసి దైత్యసింహాసన మెక్కించి మరల వారి వారి లోకములకుఁ జనిరి.

శ్రీరామా!

